# శ్రీ లలితాంబిక



ఉ॥ దంపతులమైన మేము భవదీయ పదాబ్జములంటినాము; మా
లోపములెంచకమ్మ; మములౌకిక జీవనమందు శాంతతన్
తాపమునొందనీయకు; సదా మము నీదుకటాక్షదృష్టితో
బాపముసేయనీయక; గృపావని; గావుము ఎల్లవేళలన్"

# Acknowledgement

We acknowledge with utmost sincerety, the know how from the present swami Arulananda of Sri Lalithananda Ashramam, Vodarevu.

We humbly pay our due respects to Him for the valuable guidance, and the patience he showed to hear the contents in the monuscript.

Lastly our thanks are due to all those who extended their support to us in this noble effort and bringing out this work into reality.

Yours sincerely

**P.V. Ramanamma & P. Gopala Krishnaiah**

Lalithananda Ashramam
Vodarevu.

# పెద్దల అభిప్రాయములు

**శ్రీ ధూళిపాళ్ళ వెంకటనర్స గోపాలకృష్ణ**

భారతీయ విద్యాభవన్, జూబ్లిహిల్స్, హైదరాబాద్ - 33.

ఓం పూర్వజాయై నమః

బంధూకకుసుమ ప్రఖ్యా, బాలా లీలావినోదినీ

సుమంగళీ సుఖకరీ సువేషాఢ్యా సువాసినీ॥

జగన్మాత జ్ఞానముద్ర జ్ఞానగమ్య, జ్ఞానద. జ్ఞానులచే తెలియబడునది. జ్ఞానముచేతనే తెలుసుకొనదగినది. కాబట్టి భారతీయ ఋషులందరు జ్ఞానోపాసకులు. అట్టి ఋషికోనకు చెందినవారు మాత్రమే యోగులై నిరంతరసాధనచే జగదంబ యొక్క లీలావినోదముల తాము గ్రహించి ముక్తులై యితరులనుద్ధరింపగల సమర్థులు. ఇది ఒక మహాయోగము. "జ్ఞాన", "ఇచ్ఛాశక్తి" "క్రియాశక్తి" సమ్మేళనం జ్ఞానశక్తి - అది సర్వాధారము. ఆ స్వరూపమే శ్రీమాత. తదంశ సంభూతులు, పరమహంస పరివ్రాజకులు పశుమల అవతార పురుషులు శ్రీలలితానందుల వారి చరణ సన్నిభులైన శ్రీ పర్వతనేని గోపాలకృష్ణయ్య దంపతులు యోగారూఢులై తాము దర్శించిన శ్రీదేవి అద్భుత లీలలను అనంత మహిమలను "శ్రీలలితాంబికా లీలా వినోదములు' '(శ్రీ లలితా సహస్రనామ స్తోత్రముపై వ్యాసము)ను పుస్తకరూపేణ ప్రచురించి ధన్యులైనారు.

"మనసా సాధు పశ్యతి" అని శ్రుతి. యోగుల సంప్రదాయత్వము సిద్ధించిన యీ సాధు దంపతులు ఋషులవలె తమ జ్ఞానవైభవమును పర్వత సదృశముగా చాటిన కారణ జన్ములు. ఆంధ్రభాషలో సరళతర శైలిలో తమదైన ఒరవడిలో స్వానుభవ సిద్ధ ఆధ్యాత్మిక విజ్ఞాన రహస్యాలను వివరించుటయేగాక "శ్రీ చక్రము" (రహస్యములు) తన్నిరూపణము - "షట్చక్రనిరూపణము" (అందునసించు శ్రీదేవి కళలు) "అవస్థాత్రయము" దేహము నందలి ఆయా అవయవాదుల ప్రాశస్త్యము - నాడుల సంఖ్య తద్రహస్యములు (సాంఖ్య వివరణలు) యోగశాస్త్ర రహస్యములు - లయ, ఖండయోగ, మంత్ర, తంత్ర, శాస్త్ర రహస్యములు కోకొల్లలుగా విశదీకరించుటలో ఆధునిక ఋషులై తేజరిల్లినారనుటకు ఎట్టి సందేహములేదు.

**అచ్యుతన్న సుబ్బారావు**

కార్యదర్శి

శ్రీ కోదండరామాలయ నిర్మాణ సంఘం,

సత్యనారాయణస్వామినగర్,

హబ్సిగూడ, హైదరాబాదు.

శ్రీ లలితా పరమేశ్వరి భక్తుల కామితార్థముల తీర్చెడి భగవతి. ఆతల్లి లీలలను గురించి శ్రీ వ్యాస భగవానుడు భక్తజనులకు సవివరముగా తెలిపియున్నాడు. ఆ తల్లి నామ విశేషములను గూర్చి తెలుగులో ఎందరో మహానుభావులు యింతకు పూర్వం రచించియున్నారు. శ్రీ లలితాంబికా లీలావినోదములను పేర మా మిత్రులు శ్రీ పర్వతనేని గోపాలకృష్ణయ్యగారు, వారి భార్య శ్రీమతి వేంకటరమణమ్మగారు అనేక భక్తి, యోగ సాహిత్యములను పరిశీలించి ఆకళింపు చేసుకుని ఎంతో భక్తి శ్రద్ధలతో, దీక్షతో యీ గ్రంథ రచనచేసి ఆస్తికులకెంతో మేలు కలుగజేసి వారు ధన్యులై మనందరిని ధన్యులను చేశారు.

ఆ దంపతులను లలితా పరాభట్టారిక తన కరుణా దృక్కులతో నిరంతర శాంతి సౌభాగ్యములను ప్రసాదించుగాకయని వేడుకొంటున్నాను.

భవద్విధేయుడు

అచ్యుతన్న సుబ్బారావు.

# విషయసూచిక

నిర్వ్యాజ కరుణాపూరం। లలితానంద దేశికం॥

అగణిత మహిమావిభూతి మత్తం

శృతి విహితాధ్యాత్మిక ప్రవృత్తిమంతం

శశిధర సుత కార్తికేయ రూపం

మనసి స్మరామిక్షమస్య శాంతమూర్తే॥

జయతు జయతు స్వామిన్ వాంఛితార్థ ప్రదాత

జయతు జయతు దేవో సచ్చిదానంద రూప

జయతు జయతు లోకాలోక విస్తారకీర్తే

జయతు జయతు లలితానంద కారుణ్యమూర్తే।

- హరి హరశాస్త్రి, కరూరు.

" శ్రీ వల్లీ మనోనాయకు పశుమలగిరి విహారు తావకున్

దేవసేనాప్రియు, తారకారి, ఉమాసుతున్, శరవణభవున్

శివున్ జ్ఞానజ్ఞాతృ జ్ఞేయరూప, గిరిజాసుతున్, దురితహరున్

శ్రీ విద్యోపాసకు, లలితానంద యోగీంద్ర వరదున్ గొల్చెదన్ ॥

(గో॥ ర॥)

హంతు పురామధిగళం పరిపీయ మావ:
క్రూర: కథం నభవితా గరళస్యవేగ:
నా శ్వాసనాయ యది మాతరిదం తవార్థం
దేవస్య శశ్వద మృతా ప్లుత శీతలస్య

సర్వజ్ఞతాం సదసి వాక్పటుతాం ప్రసూతే
దేవీ త్వదంఘ్రి సరసీరుహ యో: ప్రణామ:
కించస్ఫురన్మకుట ముజ్వల మాతపత్రం
ద్వేచామరేచ మహతీం వసుధాం దదాతి

కల్పద్రుమైరభి మత ప్రతిపాదనేషు
కారుణ్య వారధి భిరంబ భవత్కటాక్షై:
ఆలోకయ త్రిపురసుందరి మామనాథం
త్వయ్యేవ భక్తి భరితం త్రయి బద్ధ తృష్ణం॥

హంతేత రేష్వపి మనాంసి నిధాయ
చాన్య భక్తిం వహంతి కిల పామర దైవతేషు।
త్వామేవ దేవి మనసా సమనుస్మరామి
త్వామేవ నౌమి శరణం జనని త్వమేవ

లక్ష్యేసు సత్స్వపి కటాక్ష నిరీహాకానా
మాలోకయ త్రిపుర సుందరి మాంకథంచిత్
నూనం మయాతు సదృశ: కరుణైక పాత్రం
జాతోజ నిష్యతి జనోనచ జాయతేవా॥

హ్రాం హ్రీమితి ప్రతిదినం జపతాం తవాభ్యాం
కిం నామ దుర్లభిమిహ త్రిపురాధి వాసి।
మాలాకిరీట మదవారణ మాననీయా
తాన్సేవతే వసుమతీ స్వయమేవ లక్ష్మీ॥

ఓం శ్రీ లలితానంద సద్గురుభ్యోనమః
శ్రీ లాడర్ ఋషియై నమః

# ఉపోద్ఘాతము

శా॥ తల్లీ నిన్నుదలంచి నీదు చరితంబున్ వ్యాసరూపాకృతిన్
యుల్లంబందున బూని వ్రాయుటకు నుద్యుక్తుండనై నేడునీ
మ్రోలన్నిల్చి త్వదీయ పాదములపై మోముంచి ప్రార్థించితిన్
సల్లీలన్ నను బ్రోచి బాసటగ సంప్రీతిన్నిల్చి రక్షింపవే.

శ్రీ లలితా రహస్యనామ స్తోత్రములు బ్రహ్మాండ పురాణములో ఉత్తర ఖండమునందు హయగ్రీవ-అగస్త్య సంవాదరూపకముగా నున్నవి. వ్యాసునిచే రచించబడిన అష్టాదశ పురాణములలో నిదియొకటి.

ఈ లలితా సహస్రనామ స్తోత్రములలో మనకు కనిపించు **దేవాసురప్రముఖులు : వారి పరిచయము :**

**దేవతలు :- శ్రీ లలితాంబిక.** ఈమెదే ప్రధాన పాత్ర. మొత్తం కథా సంవిధానము రహస్యనామ స్తోత్ర రూపకముగా యీమె చుట్టూనే తిరుగుచుండును. ఈమెయే ఆదిపరాశక్తి. ఆది యనగా మొదటిదని యర్థము. ఆమెకంటే ముందు ఎవరును పుట్టియుండలేదు. 'పూర్వజాయై' అనునామము దీనిని ధృవపరచుచున్నది. సృష్టికి పూర్వమే యీమె యుండుటవలన పూర్వజయైనది. ఆమె లోకయాత్రావిధాయన్యై.. అనగా సృష్టి, స్థితి, లయ రూపకమైన లోకయాత్ర పరాశక్తికి నైసర్గిక గుణము. బ్రహ్మాండములను, లోకములను అవలీలగా సృష్టించగలదు. లోకకంటకులను శిక్షించగలదు. మహిషాసురుడు, భండాసురుడు, మున్నగు దైత్యులను సంహరించి శాంతిని నెలకొల్పినది.

**సంపత్కరీదేవి :-** ఈమె గజయూథమునకు అధికారిణి. ఈమె యధిష్టించు ఏనుగుపేరు రణకోలాహలము. భండాసురునితో జరిగిన యుద్ధములో తన సేనతో పాల్గొనినది.

**అశ్వారూఢ :-** ఈమె తురగ బలమునకు ఆధిపత్యము వహించును. ఈమె అధిష్టించు అశ్వముపేరు అపరాజిత. భండాసురునితో జరిగిన యుద్ధములో తన బలసమూహముతో పాల్గొన్నది.

**శ్యామలాదేవి :-** ఈమె శ్రీదేవికి మంత్రిణి. ఈమె యధిష్టించు రథమునకు గేయచక్రమని పేరు. భండాసురునితో జరిగిన యుద్ధములో పాల్గొని అతని తమ్ముడైన విషంగుని సంహరించినది.

**వారాహీదేవి :-** ఈమె శ్రీదేవి యొక్క చతురంగ బలములకు సర్వసేనాధిపత్యమును వహించును. ఈమె యధిష్టించు రథమునకు కిరిచక్రమని పేరు. ధ్వజము ఆనంద ధ్వజము. భండాసురునితో

# " విషయం "





శ్రీ లలితా సహస్రనామములు శ్రీ మాత్రే నమఃఅను మంత్రముతో ప్రారంభమై శ్రీ లలితాంబికాయై నమః అను నామముతో ముగియుచున్నవి. ఈమధ్యలో 998 నామమములలో శ్రీ లలితాంబిక యొక్క రూపురేఖా విలాసములు, గుణ గణములు, శత్రు సంహారము, దుష్ట శిక్షణ, శిష్ట రక్షణ, తన భక్తులననుగ్రహించుటలో శ్రీదేవికి గల ఔదార్యము ఇత్యాదులైన విషయములు స్తోత్రము చేయబడినవి. ఈ లలితా సహస్రనామములు సంస్కృత భాషలో గలవు. వీటిని మూలములోనుండి భాషాంతరీకరించి లేదా ప్రతిపదార్థము చెప్పుకుని ఆనందించలేము. మాతృకలోనున్న అక్షర రమ్యత భాషా సౌందర్యము పరభాషలో రావు. అయినను పెద్దలు కొందరు సర్వజనుల సౌకర్యార్థము తెలుగులో ప్రతిపదార్థము, కొద్దిపాటి వివరణలతో వ్రాసియుండిరి.

**"ఏకంసత్ విప్రాబహుదావదంతి"** అనుసూత్రముననుసరించి ఒకేసత్యమును వివిధ రీతులలో నిర్వచించవచ్చును. అది ఆయా వ్యక్తులయొక్క వ్యక్తిత్వము గుణ, విద్య, వినయ సంపత్తిపై నాధారపడియుండును. ఇక్కడ విద్య యనగా జ్ఞానమని గ్రహింపవలయును. అవిద్యను తొలగించునది విద్య. దీనికే చైతన్యమని పేరు. ఆ చైతన్యమే చిచ్ఛక్తి. శ్రీదేవి విద్యావిద్యాస్వరూపిణి. కనుక ఆమెను తెలుసుకొను జ్ఞానమే విద్యగాని విద్య యనగా కేవలము చదువుయని మాత్రము అర్థముకాదు. వారి

చేయగలదో, ఈ రహస్యనామ పారాయణము వలన ఏమేమి సిద్ధించగలవని చెప్పబడియున్నదో వానిని యీ వ్యాసములలో ప్రస్తావించెదము. ఏతత్ఫలితము ఆయా వ్యక్తుల ప్రవర్తనా సరళిపై నాధారపడియుండును. ఎందుచేతననగా ఇందులోనే పీటికిగల మహత్మ్యమును గురించి చెప్పినపుడు ప్రతిరోజూ ఒక్కొక్క పారాయణము వంతున చేయువాని దృష్టి పడే స్త్రీ మన్మధతాపంతో వానిని చేరుతుంది. రాజును వశము చేసుకోగోరువాడు మూడు రాత్రులు పారాయణము చేసిన యెడల ఉపాసకునికి దాసునివలె వశుడౌను అనికూడా చెప్పబడియున్నది. నాలుకపై సరస్వతి నాట్యము చేయును. లక్ష్మి స్థిరనివాసం ఉండును అని కూడ చెప్పబడియున్నది. ఇవి అన్నియు ఐహిక వాంఛలు. మరి యేకోరికలు లేకుండ అనగా నిష్కామముగా పారాయణము చేసిన యెడల వానికి జ్ఞానము, విజ్ఞానము కలుగచేసి అద్వైతసిద్ధిని పొందించుతుంది. కనుక లలితా రహస్యనామ పారాయణము ఐహికము, ఆముష్కములనొందుటకు అవశ్యము చేయవలెను. వీనిని పఠించువారు విషయానురక్తులు కాకుండ కేవలము ముముక్షువులుగా మాత్రమే చదువగలరని భావించెదము.
ఈ రహస్యనామములను శఠునకు (గురువునకు పంగనామాలు పెట్టేవాడు) దుష్టునికి, విశ్వాసము లేనివానికి ఉపదేశించకూడదని ముందే హెచ్చరించబడియున్నది.

చూ :-

"బ్రూయచ్ఛిష్యాయ భక్తాయ రహస్యమపిదేశికః
భవతాన ప్రమేయం స్వాచ భక్తాయ కదాచన
న శఠాయనదుష్టాయ న విశ్వాసాయ కరిచిత్
శ్రీ మాతృభక్తియుక్తాయ శ్రీ విద్యారాజవేదినే"

ఈ నామ పారాయ్ణము చేత సంపూర్ణ పూజ లేక జపము వల్ల కలుగునంతటి ఫలితమును పొందెదరు. అనగా అమ్మవారి యొక్క పరిపూర్ణమైన అనుగ్రహమును పొందుదురు. శ్రీ చక్రార్చనము శ్రీ విద్యా జపము సహస్రనామ పారాయణము నిత్యకృతమువలె విధిగా చేయవలయును. శ్రీదేవికి లలితా సహస్రనామ స్తోత్రమువలన కలిగినంత పరమానందము మరి ఏ ఇతర సహస్రనామముల వల్లను కలగదు. చూ॥

"యథాస్య పఠనాద్దేవ ప్రీతయే లలితాంబికా
అన్యనామ సహస్రస్య పాఠాన్నప్రీతయే తథా
శ్రీమాతః ప్రీతయే తస్మాజనిశం కీర్తయే దిదిం"

అందుచేత తనభక్తులననుగ్రహించు దయాగుణముచే శోభిల్లునదైయుండగా వశిన్యాది వాగ్దేవతలను పిలిపించి వారిని తన రహస్య నామములను రచించి స్తోత్రము చేయవలసినదని యాజ్ఞాపించినది. ఆమెయొక్క ఆజ్ఞానువర్తనులై శ్రీదేవి నిండు పేరోలగమునందు సింహాసనాసీనయై యుండగా

సద్గురువు దొరికినాడు. ఆయనద్వారా మనమంతా మోక్షమునందుటకు లలితారాధన చేయుచు గోపాలశర్మగారు తమ కీర్తనలో వ్రాసినట్లుగా "ఇతరుల నమ్మేదిలేదు - లలితానంద
సద్గురునాజ్ఞ దాటేదిలేదు . . .
. . . . తిన్నగదరిచేర్చు - గురుదేవు

వదిలేసి ఇతరుల" అనుచు శ్రీ లలితానంద స్వామివారు చెప్పినట్లుగా నడచుకొనుచు లలితారాధనతోనే మళ్ళీ, మళ్ళీ జన్మరాకుండ రక్షించమని వేడుకొనుచు దుర్లభమైన ఈ మానవజన్మను సార్ధకము చేసుకొనెదముగాక.

భండాసురుడు యుద్ధములో అనేకమంది రాక్షసులను పుట్టించుచుండగా అతడు ప్రయోగించిన ప్రతి అస్త్రమును త్రిప్పి కొట్టుటకు శ్రీదేవి తన చేతి వ్రేళ్ళ గోళ్ళ నుండి శ్రీమన్నారాయణుని దశావతారములను సృజించి ఆయా రాక్షసులను వధించినది. చూ॥
"కరాంగుళీ నఖోత్పన్న నారాయణ దశాకృతా" అను నామము దీనిని ధృవీకరించుచున్నది. 'ఆజ్ఞా అను నామము ననుసరించి శ్రీదేవి యానతితోనే ఆయా సందర్భానుసారముగ విష్ణువు దశావతారములనెత్తి లోకములందధర్మమును నశింపజేసి ధర్మసంస్థాపన చేసినాడు. అంతటి మహామహిమాన్వితులైన త్రిమూర్తుల ప్రాదుర్భావమునకు కారణమైన ఆది మూలము యొక్క శక్తి కొలతలకు, లెక్కలకు అందనది. అందుచేతనే యీమె 'అమేయా' యైనది. అయినా ఉడుతా భక్తిగా అమ్మవారిని గురించి వచన రచన చేయవలయుననితలంపు కలిగి శ్రీ లలితా సహస్రనామములనే ఆధారముగా చేసుకుని రచించుటకు సంకల్పించి సద్గురు లలితానందాశ్రమమును ప్రస్తుతము నిర్వహించుచున్న శ్రీ అరుళానంద స్వామివారితో సంప్రదించగా వారు మాయీ ప్రయత్నముకు అనుమతిని యిచ్చినారు. అంతేగాక వారు మాకు సంపూర్ణ యాశీస్సులనందించుచు మాకు దైవానుగ్రహము కలుగుటకును, అమ్మవారి చల్లని చూడ్కులకొఱకును ఈ క్రింద చూపబడిన విధముగా దివ్యక్షేత్రములకు తీసుకుని వెళ్లి మమ్ములను పునీతులను చేసిరి.

1. నెల్లూరుజిల్లాలోని పెంచలకోన శ్రీ లక్ష్మీనరసింహ స్వామివారు.

2. తిరుత్తని శ్రీ సుబ్రహ్మణేశ్వర స్వామివారు

3. కాంచీపురమునందు శ్రీ కామాక్షీదేవివారు

4. పాండుచ్చేరిలోని లక్ష్మీగణపతి ఆలయము

# ప్రస్తావన

## గీతిక :



శ్రీ మాతే । పరమేశ్వరీ ।
ననుగన్న మా తల్లి । మహేశ్వరి
చూడుమొకసారి కను విప్పి మమ్ము
ఇటుసారింపు నీ దయారసము
లోకాన్ని మరిచిపోతివా? తల్లి ।
లేక నన్నే మరిచిపోతివా ॥ శ్రీమాతే ॥
అమ్మవునీవే అంబవు నీవే
ఆదిపరాశక్తివీ నీవే ॥ శ్రీమాతే ॥
ఓం కారములోన్ను శక్తివినీవే
దయతలపవా తల్లీ । దయ తలపవా
నామీద దయ దలచి నన్ను గాంచవా ॥ శ్రీమాతే ॥

మా యీ వ్యాసరచనకు స్ఫూర్తినిచ్చినది పై పాట ఈ పాటను మాద్వితీయ పుష్పం చి॥సౌ॥ కనకలతాదేవి తన పదకొండవ సంవత్సరములో రచించినది. ఈ పాట కూడ శ్రీ లలితా సహస్ర నామావళివలెనే "శ్రీమాతే" అని ప్రారంభించబడియున్నందున మా వ్యాసరచనను ఈ పాటతోనే ప్రారంభించుచుంటిమి. వాడరేవులోగల శ్రీ లలితానందాశ్రమములో అమ్మవారు చూపిన అద్భుతములు, లీలలు చూచి ఆనందించుటకు మనకున్న రెండు కన్నులు చాలవు. శ్రీ లలితానందస్వామివారి శిష్యులైన కీ॥శే॥ బొమ్మరాజుగోపాలకృష్ణమూర్తిగారు అమ్మవారి లీలలు చూచి తన్మయత్వములో "నరులనే సురలుగా చేసి ఆడించి పాడింతువు" అను పాటను రచించి గానము చేసిరి. ఆమె లీలా విగ్రహధారిణి అని సహస్రనామములో వర్ణించినట్లు తనకేమియు అక్కరలేకపోయిన తన బిడ్డలకొఱకు అనేక అవతారములు సులభముగా ధరించగలదు. ఆశ్రమములో శ్రీ వల్లీ దేవసేనా సమేత సుబ్రహ్మణ్యేశ్వర స్వామి ప్రతిష్ఠలప్పుడు, ఆదిపరాశక్తి ప్రతిష్ఠ సమయములోను శ్రీ చండి అమ్మవారు, శ్రీ త్రిపుర సుందరి అమ్మవారు తక్కుంగల దేవతలు అనేక అవతారములతో స్త్రీలపై నావహించి నాగస్వరముతో లయగల్పి అత్యద్భుతముగా నృత్యము చేసిన దృశ్యమును చూచి యానందించిన జన సందోహము నిజముగ నదృష్టవంతులు, పుణ్యాత్ములూను. అది దేవలోకము యావత్తు దివినుండి భువికి దిగివచ్చెనాయని సంభ్రమాశ్చర్యములు గొలిపినది. ఆ సమయములో కవులు, పండితులు, వాగ్గేయకారులు దివ్యానుభూతితో తమ శక్త్యానుసారము వేనోళ్ళ స్తుతించి కీర్తించిరి. నందిగామకు

ప్రయత్న పూర్వకముగా ఆమె చరితనే వ్రాయబూనితిమి.

"పలికెడిది భాగవతమట
పలికించెడు వాడు రామభద్రుండట
నేపలికిన భవహరమగునట
పలికెద వేరొండుగాథ పలుకగనేలా"

యని పోతనామాత్యుడు భాగవతరచనను ప్రారంభించుట యెంతేని సమంజసముగానున్నది. ఆ కవిహృదయమును గూడ స్ఫూర్తిగా తీసుకుని అమ్మవారిపైన మాకు గల అచంచల విశ్వాసముతో నామెపైనే భారము వైచితిమి.

భండాసురుడు లోకకంటకుడై లోకములను అల్లకల్లోలము చేయుచున్న తరుణమున బ్రహ్మాది దేవతలు చేష్టలుడిగి వేరు మార్గము కానరాక అమ్మవారినాశ్రయించి దైత్యసంహారమును గావించి లోకమున శాంతి నెలకొల్పవలసినదిగా ప్రార్థించిరి. భండాసుర వధ నిమిత్తము సమస్తదేవతలు తమ తమ శక్తులను, తేజస్సును అమ్మవారికి అర్పించినారు. అంతట అమ్మవారు కరుణాంతరంగయై, లోకకళ్యాణార్థమును, భండాసుర వధ, మహిషాసురవధ, మొదలగు దైవకార్యములను నిర్వహించుటకును లలితా రూపమునంది బ్రహ్మతేజోమయరూపమైన చిదగ్నిగుండమునుండి ఉద్భవించుచున్నది.

శ్రీ లలితా సహస్రనామములలో శ్రీదేవి చరితమును ఆమె ప్రాదుర్భావము, పట్టాభిషేకము భండాసుర వధ క్రమములో చెప్పబడియున్నందున ఇచటగూడ దేవి చిదగ్ని కుండమునుండి బయల్వెడలుట తోనే ప్రారంభము చేయుచుంటిమి[2]. ఈ సంధర్భమున హయగ్రీవునితో అగస్త్యుని విన్నపమును గమనించగలరు. చూ॥

పూర్వం ప్రాదుర్భవో మాతుస్తతః పట్టాభిషేచనం,
భండాసువధశ్చైవ విస్తరేణ త్వయోదితః ॥
(పూర్వపీఠికా)

**సూచన :** ఈ ఇతివృత్తమునందలి ప్రధానసంఘటనములను మాత్రమే పేర్కొనుట మా యుద్దేశ్యమై యున్నది.

**N.B.** శ్రీదేవికి పుట్టుకేలేదు కాబట్టి ఆమెకు అస్తిత్వము మాత్రమే కలదు.

ఆమె చిత్స్వరూప. కనుకనే చిదగ్నికుండమునుండి వచ్చుచున్నది.

శ్రీదేవి యొక్క దేహమునుండి వెలువడుచున్న యెఱ్ఱని కాంతి కిరణ సముదాయము బ్రహ్మాండములన్నింటిని ఆవరించి మొత్తమంతయును యెఱ్ఱని కాంతికలదైయై ప్రకాశించుచుండెను.

దేవతలను ఆపాద మస్తకము వర్ణించుట సంప్రదాయ పద్ధతి. చూ॥

' దేవతానాం పాదాంగుష్ఠ ప్రభృతి వర్ణ్యతే
మానుషానాం కేశాదారభ్యతు అని '

కాని యిచట శ్రీమాత అగ్నిగుండమునుండి బయల్వెడలునపుడు శిరస్సే మొదటగా కనిపించినందున ఊర్ధ్వభాగమునుండి వర్ణించబడియున్నది. అమ్మవారు చంపకము, అశోకము, పున్నాగము సౌగంధికములను పుష్పజాతి విశేషములతో విరాజిల్లుచున్న కేశపాశమును కలిగియున్నది. ఆమె కొప్పు సహజ సుగంధమును కలిగినట్టిది. ఆ సుగంధమే పైన చెప్పబడిన పుష్పములయందు ప్రవేశించినదా యనునట్లు ఆ కుసుమసౌరభము, ఈ సహజసుగంధము దేనికి యేది ఆపాదితమో తెలియరాకున్నదని చమత్కరించబడినది. ఆమె ధరించిన కిరీటము పద్మరాగమణులతో పొదగబడియున్నది. ఆ కిరీటమునుండి వెలువడు యెఱ్ఱని కాంతి తన భక్తుల అజ్ఞానాంధకారమును తొలగించునదిగాయున్నది. ఆమెనుదురు అష్టమినాటి చంద్రునివలె సమానార్థకముగా ప్రకాశించుచున్నది. ఆమె ధరించిన కస్తూరీతిలకము చంద్రునిలోని మచ్చవలెనే యున్నదని వర్ణించుచున్నాడు. అయితే చంద్రునికి మచ్చవలెగాక ఈ కస్తూరీ తిలకము అమ్మవారి ముఖము యొక్క అందమును ద్విగుణీకృతము చేయుచున్నది. శ్రీదేవి ముఖము మన్మధుని మంగళగృహము. ఆ గృహమునకు ఆమె కనుబొమ్మలే బహిర్ద్వార తోరణములుగా ప్రకాశించుచున్నవి. ". . . . మీనాభలోచనాయై" అని వర్ణించుటచేత అమ్మవారి కనులను చేపలకనులతో పోల్చుటవలన కావ్యనాయకవలెనున్నదని భ్రమ పడరాదు. పూర్వకవులు, ప్రబంధకవులు గూడ కథానాయికలను వర్ణించునపుడు సామాన్యముగా వాడే పరిభాషయది. మత్స్యకంటి, వాలుకంటి మొ॥ కాని ఈ నాయిక అట్లుగాదు. ఆశబ్దము యథాతథముగా మీనాక్షియే. చేపలు తమ సంతతికి పాలిచ్చి పోషించవు. తల్లిచేప చూపులే పిల్లచేపకు పోషకాహారము. అటులనే ఈ మధురమీనాక్షి చల్లని చూపులు తన న్నాశ్రయించిన వారి కోరికలను తీర్చుచుండును. అందుచేతనే తరువాత వచ్చు నామములలో శ్రీలలితాంబికను "కామాక్షి, కామదాయినీ " అని స్తుతించుట జరిగినది. శ్రీదేవి ముక్కు అప్పుడే వికసించుచున్న సంపెంగ పువ్వుతో సమానముగా నున్నది. ఆమెధరించిన ముంగెరనుండి వెలువడుచున్న కాంతి అంగారకుని, శుక్రుని కాంతిని తిరస్కరించుచున్నది. ఆమె తన కొప్పుముడిలో చెవి పైభాగమున కదంబ పూగుత్తిని ధరించియున్నది. ఈ అలంకరణను అత్యంతాధునికముగ గూడా మనము చూచుచున్నాము. ఆమె ధరించిన చెవికమ్మలు సూర్య, చంద్రుల వలె ప్రకాశించుచున్నవి. అనగా సూర్యచంద్రులే యామెచెవులకాభరణములని భావము. ఆమె చెక్కిళ్లు అద్దముకంటె నునుపుగను పద్మరాగము కన్నమిన్నయైన యెఱ్ఱని కాంతి కలిగి శివుని

# మహాసామ్రాజ్య పట్టాభిషేకము

**శ్రీదేవికి ముఖ్యస్థానములు** : శ్రీ కంఠార్ధ శరీరిణి యనిస్తుతించుటచేత శివుని శరీరములోని అర్ధభాగమునాక్రమించి యేకముగా ఆయన యెడమ తొడపైననే స్థిరపడినదని, ప్రధానముగా అదియే ఆమెకు మొదట స్థానమని విశదమగుచున్నది. మిగిలినవి : హిమాచలము, వింధ్యాచలము, మున్నగు పర్వతశ్రేణులు : సుమేరు,శృంగమధ్యస్థా, శ్రీమన్నగరనాయకా, చక్రరాజనికేతనా, శ్రీచక్రరాజనిలయా అని స్థుతించుట చేత శ్రేష్ఠమైన మేరుపర్వత మధ్యభాగమున నున్న నాల్గవ శృంగము నందును, శ్రీమన్నగరమనగా శ్రీవిద్యానగరమనబడు శ్రీచక్రము నందును గూడ లలితాంబిక నివసించుచున్నదని, త్రైలోక్యమోహనాది నవ చక్రములే యామెకు నిలయమని తెలియుచున్నది. మేరు నగరమునకు శ్రీచక్రమునకును అవినాభావ సంబంధము. శ్రీ చక్రము మేరుమంత్ర స్వరూపము. చూ :

శ్లో ॥ మేరు మంత్రాత్మకం చక్రం శ్రీత్వేషస్త్రత్ర దేవతా :
కామేశ్వరః ప్రకాశాత్మా శ్రీర్విమర్శాంస్తదంకగా,
ఇత్యేతద్వాసనారూప మభేదంచ పరస్పరం
జ్ఞాత్వాశ్రీగురువక్త్రాబ్జాత్కృతా పూజామహాఫలా"

శ్రీ చక్రములోని భూపురము మొదలు బింద్వంతము వరకు గల నవచక్రములును మేరుమంత్రము నందున్న 'ల' కారాది వర్ణములు ప్రకృతిగాగలవి. ఆబీజము వలన ఆయావరణ చక్రముత్పత్తి యైనందున శ్రీ చక్రము మేరు మంత్ర స్వరూపము. అందున్న ఆవరణదేవతలుశ్రీదేవి శరీరకాంతికి కిరణ సముదాయముగా నున్నారు. బిందుమండలము నందున్న కామేశ్వరునికిని అతని వామాంకమునందున్న కామేశ్వరికిని ప్రకాశ విమర్శాంశములుగా భేదములేదని తెలిసికొని చేసిన చక్రార్చనా ఫల మమోఘము. మేరుమంత్ర బీజములు: లం-సం-హం-ఈం-ఏం-రం-కం-అః అం మొత్తము తొమ్మిది బీజములు !

ఇంతవరకు వివరించ బడిన శ్రీవిద్యా నగరము మేరునగమధ్యమునందున్నది. మరి యొకటి బ్రహ్మాండమునకు వెలుపల క్షీరసాగర మధ్యమునందున్న నవరత్న ద్వీపము. దాని చుట్టు పంచవింశతి (25) ప్రాకారములు గలవు. దానిని చేరుట మానవులకసాధ్యము. దానిలోపల మణిమండపము, కల్పకోద్యానవనము, నీపశ్రేణి, చింతామణి గృహము, పంచబ్రహ్మాసనము ఆపైన సదాశివ పర్యంకమును గలవు. శ్రీచక్రములో నీబ్రహ్మాండమంతయునిమిడియున్నది. అందుచేత బ్రహ్మాండము, పిండాండము, శ్రీచక్రము సమాన ధర్మములు గలిగి యేమాత్రమును భేదము లేకుండ నున్నవి. ఇప్పుడు బ్రహ్మాండము నందుగల రత్న ద్వీపమును గురించి ప్రస్తావించు చున్నాము. దీని ప్రాకారములు పంచలోహములతోను,

కామకలా విలాసము నుండి గ్రహించబడినది)

నడుమ విష్ణువు, 17-16 ప్రాకారముల నడుమ బ్రహ్మ, 14-15 ప్రాకారముల మధ్య ఇంద్రుడు శ్రీదేవి సేవలో యుందురు. అలులనే మార్తాండభైరవుడు 22-23 ప్రాకారములనడుమ అమ్మవారిని సేవించుకొనుచుండును. మిగిలిన ప్రాకారములయందును ఇతర దేవతలు లలితాంబిక సేవకై సదా నిరీక్షించుచుందురు. ఈ ప్రాకారములనన్నిటిని దాటు కొనుచూపోయిన పిదప శ్రీ లలితా పరా భట్టారిక నివసించు ఇరవై అయిదవ ప్రాకారము వచ్చును. అది శత యోజనముల విస్తీర్ణము కలిగియున్నది. ఆ ప్రాకారము ఒకేజాతి రత్నములతోగాక నవరత్నములతో నిర్మించబడియున్నది. దానిలోపల గల భవనములు రాజప్రాసాదములు, మందిరములు, మండపములు అన్నియు నవరత్నములతో తాపడం చేయబడినవియే. ఈ ప్రాకారము నందున్న జలాశయములు పరిశుద్ధమైన జలములతో స్ఫటికమువలె నిర్మలముగా యుండును. అక్కడ శ్రీదేవి అవతారమూర్తులు, మహా విద్యలు, సప్తకోటి మంత్రాలు వాటి అధిష్టాన దేవతలతోను ఆమె ఆభరణములతొ నిండియుండు గదులతోను, ఆమె వాహనములు నిలిపియుంచుటకు కట్టిన రథశాలలు, ఏనుగుల, గుఱ్ఱాల శాలలు, ఆయుధములు నిల్వయుంచుటకు కట్టిన ఆయుధాగారములు మొదలైన వాటితో క్రిక్కిరిసియుండును. వీటినన్నిటిని దాటిన తరువాత మణిమందిరము వచ్చును. దానిలోపల త్రివిధదళాధిపతులకు వసతి సౌకర్యములతో సహా వారి కార్యాలయములు గలవు. అది వెయ్యిస్థంబాలతో నిర్మించబడియున్నది. దాని మధ్యలో శ్రీదేవి నివసించు చింతా మణిగృహము వచ్చును. చింతలు లేని గృహము చింతామణి గృహము. శ్రీదేవి యచటనుండియే భక్తుల చింతితార్థములను తీర్చుచుండును. అది నానావిధ మణిరత్నములతో నిర్మించబడి యుండినందున ధగద్ధగాయ మానముగా మెరసిపోవుచుండును. దానికి నాలుగు వైపులందు శృంగార మండపములు (నర్తనశాలలు) ముక్తి, జ్ఞాన, ఏకాంత మండపములు వచ్చును. అవి యన్నియు అత్యంత సుందరముగా అలంకరించబడియుండును. నర్తనశాలలో అప్సరోభామినులు తమతమ నటనాకౌశలముతో, సంగీత సాహిత్యాలతో శ్రీదేవిని ఆనందపరచుచుందురు. 'రంభాది వందితాయై' అనియనుటచేత రంభ యనుచర అప్సరబృందము అమ్మను అలరింపజేయుచున్నదని భావము. అచటనుండి ముక్తి మండపమునకు వచ్చి తానే ముక్తికి నిలయమై, ముక్తిస్వరూపిణియై తననాశ్రయించిన వారికి పునర్జన్మరాహిత్యముచేయును. తరువాత జ్ఞానమండపములో ప్రవేశించి తన భక్తులకు జ్ఞానభిక్షను ప్రసాదించి వారికి అద్వైతసిద్ధిని కలుగజేయుచుండును. అనగా వారు తమ నిజరూపమును తెలిసికొని అమందానందము ననుభవింతురు. చివరగా ఏకాంత మందిరములో ప్రవేశించి మంత్రిణియైన శ్యామలాంబతోను, సర్వసేనా నాయకురాలైన వారాహి దేవితోను కొలువుదీరి రాచకార్యములు నిర్వహించుచు రాబోవు భండాసుర యుద్ధమును దృష్టిలో నుంచుకుని రాజ్యభారమును శ్యామలాంబ భుజస్కంధములపై నుంచి తాను స్వయముగా మహా సామ్రాజ్య రక్షణ భారమును వహించుచుండును. ఆ తరువాత అచటికి దగ్గరలోనే గల పంచబ్రహ్మాసనముపై విజయముచేసి

# శ్రీచక్రము - సంక్షిప్త వర్ణనము

శ్రీచక్రము నవయోన్యాత్మకము. నవచక్రాత్మకమును అయివున్నది. దీనియందుగల కేంద్ర బిందువు పరాశక్తి స్వరూపమే. ఇది నవ చక్రములకును, పశ్యంతీ, మధ్యమా, వైఖరీ రూపముగల మాతృకకును కారణస్వరూపముగా నున్నది. ఇందు ప్రథమ యోని చక్రముయొక్క త్రిభుజములు క్రమముగా 1. పంచాశద్వర్ణ మాతృకగను, 2. పంచదశ వర్ణమయ మూలమంత్రముగను, 3. షోడశ నిత్యాస్వరూపములగు అకారాది స్వరములుగాను, దానికోణబిందువులు : 1. చంద్రాగ్ని సూర్యమండలముగను, 2. సత్వ, రజ, స్తమోగుణ త్రయము, 3. వాగ్భవ, కామరాజ, శక్తి సంజ్ఞలు గల బీజత్రయము 4. ఇచ్ఛా, జ్ఞాన, క్రియలను శక్తిత్రయము 5. బ్రహ్మ, విష్ణు, రుద్రులనే మూర్తి త్రయము 6. జ్ఞాన, జ్ఞాతృ, జ్ఞేయములనే త్రిపుటిగాను పరిణామముజెంది అన్ని త్రిసంఖ్యలు గల్గి బ్రహ్మాండమంతా నిండియున్నవి. కోణములు కలది చక్రమని, దళములు గలది కమలమని సంజ్ఞలుగా కలిగియున్నవి. కోణములు విమర్శాంశములు, దళములు ప్రకాశాంశములుగాను ఉన్నవి. త్రికోణ, అష్టకోణ అంతర్దశార, బహిర్దశార, మన్వస్రములైదు విమర్శాంశములు. బిందు, అష్టదళ, షోడశదళ, భూపురములు నాలుగు కమలములు ప్రకాశాంశములు. దీనిలో మొత్తం 45 కోణములు, 29 దళములు గలవు. మరియు 24 సంధి స్థానములు, 28 మర్మస్థానములు కలిగి ప్రకాశ, విమర్శాంశలగు కామేశ్వరీ, కామేశ్వరులకు ఈ శ్రీ చక్రమే స్థానముగా నున్నది.

స్వస్వరూపజ్ఞానమును అనగా మానవుడు తన నిజరూపము తెలిసికొనుటకు ఆత్మానాత్మ, సత్యాసత్యముల విచారణములవసరము. దానికి బ్రహ్మాండస్వరూపము, ఈరేడు లోకములగుఱించిన కొంత అవగాహన అవసరము. పిండాండము, బ్రహ్మాండములు సమాన ధర్మములు కలిగియున్నవి. కనుక శరీరమును గూర్చిన విచారణతో విషయము బోధపడును. ఈశరీరవిచారణ కంతరంగ భేదములున్నందున విచారణ కష్టసాధ్యమని పరమేశ్వరుడు సాధకజనులననుగ్రహించు దయా గుణము గలవాడై శ్రీ చక్రమును నిర్మించినాడు. బ్రహ్మాండము, పిండాండము, శ్రీచక్రములు సమాన ధర్మములు కలిగియున్నవి. ఇది శ్రీ చక్రమును గుఱించిన విహంగవీక్షణము. శ్రీ చక్రమునకును ఉపాసకుని దేహమునకును ఈ క్రింది విధముగా సామరస్యము గూర్చబడియున్నది.

" బైందవం బ్రహ్మరంధ్రంచ మస్తకంచ త్రికోణకం
లలాటే ష్టార పత్రంచ భృవోర్మధ్యేదశారకం
బహిర్దశారం కంఠేతు మన్వస్రం హృది సంస్థితం
నాభౌచ వసుపత్రంచ కట్యాం షోడశ పత్రకం
వృత్తత్రయంచ ఊరూభ్యాం పద్భ్యాం భూపురత్రయం "

6. సప్తధాతువులతో కలిసిన ఈ శరీరములోని మనోసంకల్పములే కల్పవృక్ష సముదాయము.

7. సహస్రారగత చిత్కళాప్రతిబింబమే జీవస్వరూపము. దానికిరణములు శరీరమంతటను వ్యాపించియున్నవి. దాని తేజస్సు కల్పకోద్యానవనము.

8. నాలుకచేత తెలిసికొను రుచులు షడ్రుచులు వీటిని ఆరుబుుతువులుగాను భావించవలయును.

9. సాధకుని శరీరమునందు ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులున్నవి. సంకల్ప రూపమే ఇచ్ఛాశక్తి. శ్రీదేవి ప్రధానము. జ్ఞానశక్తి మందిరము (శ్రీనగర మణిద్వీప చింతామణిగృహము) క్రియాశక్తి పీఠము పంచప్రేతాసనాసీనగా భావించవలయును. పరాశక్తియే ఇచ్ఛాశక్తి, జ్ఞానశక్తి, క్రియాశక్తులు కలిసి పశ్యంతి; మధ్యమా, వైఖరీ రూపములగుచున్నవి.

10. విషయ పరిజ్ఞాన సాధకుడే శ్రీచక్ర అంతర్యాగమునకు యజమానియగు జ్ఞాత (తెలుసుకొనువాడు) అర్ఘ్యమే జ్ఞానము, హవిస్సే జ్ఞేయము (తెలియదగినది త్రిపుర) జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానములే త్రిపుటి, వీటి ఐక్యములను సంభావించుటే శ్రీ చక్రపూజ. జ్ఞాత, జ్ఞేయములు జ్ఞానమున లీనమైనపుడు జ్ఞానమభివృద్ధి జెంది జ్ఞానమొకటియే నిలుచును. అదియే పర బ్రహ్మము. ఆత్మస్వరూపము. బ్రహ్మానందముననుభవించు స్థితి మరియు శ్రీ చక్ర పూజాఫలము.

11. శ్రీ చక్రార్చన భూపురమునుండి ఆరోహణాక్రమముగా చేయవలసియున్నందున నవావరణ దేవతలను గుఱించి తెలుపబడుచున్నది.

భూపురం మొదటి శుక్ల వర్ణ రేఖయందు (మూలాధారమున) నవరసాధి దేవతలు 1. అణిమా 2. లఘుమా 3. గరిమా 4. మహిమా 5. ఈశత్వ 6. వశిత్వ 7. ప్రాకామ్య 8. భుక్తి 9. ఇచ్ఛా 10. ప్రాప్తి. 11. సర్వకామ సిద్ధులు. 1. శాంత రసం 2. శృంగార 3. హాస్య 4. కరుణ 5. రౌద్ర 6. వీర 7. భయానక 8. భీభత్స 9. అద్భుత రసములు.

1. వామ 2. జ్యేష్ఠ 3. రౌద్రి 4. అంబిక 5. పశ్యంతి 6. ఇచ్ఛా 7. జ్ఞాన 8. క్రియా 9. శాంత. నవయోనులు.

12. భూపురం రెండవరక్త వర్ణరేఖయందు (మూలాధారము) అరిషడ్వర్గములతో కలిసి పుణ్యాపాపములు ఎనిమిదింటికి ఎనిమిది మంది దేవతలు కలరు. వారు : 1. బ్రాహ్మి 2. మాహేశ్వరి 3. కౌమారి 4. వైష్ణవి. 5. వారాహి 6. మహేంద్రి 7. చాముండి 8. మహాలక్ష్మి. అష్టమాతృకలు. వీరి సమష్టి రూపము సప్త ధాతువులు. 13. భూపురము మూడవ రేఖయందు (మూలాధారము) 9 మంది ముద్రాదేవతలు గలరు. 1. మూలాధార. 2. స్వాధిష్టాన 3. మణిపూర 4. అనాహత 5. విశుద్ధి 6. లంబికాగ్ర 7. ఆజ్ఞ 8. సహస్రార 9. ద్వాదశాంతములకు తొమ్మిది మంది ముద్రా దేవతలు. వారు : 1. సర్వసంక్షోభిణి. 2. సర్వ విద్రావిణి 3. సర్వాకర్షిణి. 4. సర్వ వశంకరి 5. సర్వోన్మాదిని. 6. సర్వమహాంశ 7. సర్వఖేచరి 8. సర్వబీజ 9. సర్వయోని.

14. శ్రీ చక్రము రెండ ఆవరణము : షోడశదళ పద్మము : అందు పదునారు మంది దేవతలు కలరు.

2. కామేశ్వరి 3. మోదిని 4. విమలా 5. అరుణ 6. జయిని 7. సర్వేశ్వరి 8. కౌళినిలు (వాగ్దేవతలు)
20. దేవి హస్తమునందు ఐదు పుష్పబాణములు కలవు. శబ్ద, స్పర్శ, రూప, రస, గంధములయిదును పంచభూతధర్మములయినవి. పుష్పములు : 1. తామర 2. అశోక 3.. మామిడి 4. మల్లె 5. నల్ల కలువ.
21. శ్రీదేవి చేతియందున్న చెఱకు విల్లు సాధకుని మనస్సు.

వశ్యత, బాణము, రాగము, పాశము, ద్వేషం (క్రోధం), అంకుశము (19 నుండి 21) మనోమయకోశము.

22. ఎనిమిదవ ఆవరణము : త్రికోణము : 1. అవ్యక్తము. 2. మహత్వతత్వము 3. అహంకారము ఇందలి దేవతలు : 1. కామేశ్వరి 2. వజ్రేశ్వరి 3. భగమాలిని అనువారు. వారే 1. పార్వతి 2. లక్ష్మి 3. సరస్వతులు (ఇది విజ్ఞానమయకోశము)

23. శ్రీ చక్రమునందు బిందువును క్రమ్ముకుని యున్న త్రిభుజరేఖల యందు రేఖకు ఐదుమంది వంతున పదిహేనుమంది కాల పరిమాణమును తెలుపు తిథి దేవతలు కలరు. వారే నిత్యదేవతలైరి. వారు : 1. కామేశ్వరి 2. వజ్రేశ్వరి 3. భగమాలిని 4. నిత్యక్లిన్నా 5. భేరుండ 6. వహ్నివాసిని 7. శివదూతి 8. త్వరిత 9. కులసుందరి 10. నిత్యా 11. నీలపతాకా 12. విజయా 13. సర్వమంగళ 14. జ్వాలా మాలిని 15. చిత్ర అనువారు

24. తొమ్మిదవ ఆవరణము : ఇందున్న ప్రధాన దేవతలు కామేశ్వరీ హంస ద్వంద్వము. ఆత్మశరీరమునకు ప్రజ్ఞానమైయున్నది. శ్రద్ధారూపమైన బుద్ధి శ్రీ చక్రమధ్యగత బిందువుగానున్న కామేశ్వరి + కామేశ్వరము. సాధకుని ఆత్మయే కామేశ్వరియని భావము. ఆత్మకును, శ్రీదేవికిని ఐక్యముగా సంభావించవలయును. ఆత్మ శ్రీదేవి అయినపుడతడు తటస్థలక్షణములు గల బ్రహ్మమే. మహావాక్యములచేత నిరూపించబడుచున్న బ్రహ్మాత్మైక్యక అనుసంధానము. కైవల్యప్రాప్తి, జీవన్ముక్తి ఇవియే (ఇది ఆనందమయకోశము).

ఈ ఐక్యమనునది ప్రధానైక్యము, పూజా కలాపమున క్షీరద్రవ్యములచేత కల్పసూత్రము ప్రకారము శ్రీచక్రార్చన సలుపుట, చతుర్విధైక్య (పంచ విధైక్య), షడ్విధైక్య మహానవమియందు మహావేధాదుల అనుసంధానము మున్నగు వాటిని సమయమత వేత్తలు నిశ్చయించిరి.

చతుర్విధైక్యము : 1. శ్రీ పరదేవతాశ్రీ చక్రయోరైక్యం 2. శ్రీ చక్ర బ్రహ్మాండయోరైక్యం 3. బ్రహ్మాండ, పిండాండ యోరైక్యం 4. మాతృకాదేవతా యోరైక్యం.

షడ్విధైక్యం : 1. శ్రీ చక్రము2. మాతృక 3. పంచదశీవిద్య 4. లలితాదేవత 5. బ్రహ్మాండము. 6. పిండాండము.

వీటికి సామరస్యము. ఏకత్వమును సంపాదించుటయే సమయమతమునందు పరదేవతారాధన అనియు ఇదియే అంతర్యాగమనియు చెప్పబడుచున్నవి.

# భండాసుర వధ

సతీదేవి శివుని మొదటి భార్య. దక్ష యజ్ఞం సమయమునందు కన్న తండ్రి వలన తనకు గలిగిన యవమానమును భరించజాలక ఆత్మాహుతియైనది. పిదప శివుడు భార్యావియోగమును భరించజాలక హిమాలయములకేగి ఆది పరాశక్తిని గూర్చి ఘోరతపమునాచరించుచుండెను. సతీదేవి మరల మేనకా హిమవంతులకు కుమార్తెగా జన్మించి పార్వతిగా పెరిగి పెద్దదగుచుండెను. పార్వతికూడ శివుని పరిణయ మాడదలచి కనీసము ఆకులు అలములు (అపర్ణాయై) కూడ ముట్టకుండ కఠోరమైన తపమాచరించుచుండెను.

తారకాసురుడను రాక్షసుడు ముల్లోకములను జయించి లోకకంటకుడై యుండెను. అతనిని సంహరించగల శక్తిమంతుడు శివపార్వతుల సంతానమైన కుమారస్వామి మినహా మరి ఎవరును లేరు. అతని పుట్టుక కొరకై దేవతలంతా ఆలోచించి శివునికి తపోభంగము కావించి పార్వతిమీద మనసు కలుగునట్లు చేయగల సమర్థుడు మన్మథుడేయని తలంచి అతనిని యాపనికై నియోగించిరి. ఆ కార్యము ప్రాణసంకటమైనది. అయినను దేవకార్యము నిమిత్తం ప్రాణములొడ్డుటకైనను మన్మథుడు వెనుదీయలేదు.

పార్వతి తండ్రియనుమతితో శివునికి సపర్యలు చేయుచు అచట యుండినది. అట్టి సమయములో అదనుజూచి మన్మథుడు తన చెరకు విల్లునెక్కుపెట్టి కుసుమాస్త్రములను వారిపై సంధించెను. ఈవిధముగా శివునికి తపోభంగమైనందున కినుక వహించిన యా ముక్కంటి తన మూడవకంటిని తెరచి మన్మథుని భస్మము గావించెను. అట్లు శివుని కోపాగ్నికి భస్మమైన మన్మథుని చితాభస్మమునుండి భండాసురుడు పుట్టినాడు. ఇక మన్మథుని విషయము : "మను విద్యాయై" అను నామము ప్రకారము మనవుమొదలు దూర్వాసుని వరకుగల పన్నెండు మంది శ్రీవిద్యోపాసకులలో మన్మథుడు ఒకడు. అతని తండ్రి సాక్షాత్తు శ్రీ కృష్ణుడు. అంతటి ఘన చరిత్రగలిగిన మన్మథుని చితాభస్మమునుండి భండాసురుడు పుట్టుట నిజముగా బాధాకరమైన విషయము. ఆ భండాసురుడు ముల్లోకములను జయించి ఇంద్రుని పదవీభ్రష్టుని గావించి ఏకచ్ఛత్రాధిపత్యముగా నేలుచుండెను. అతని యేలుబడిలో దేవతలంతా తమ తమ నెలవులు దప్పి చేష్టలుడిగి యుండిరి. అంతట బ్రహ్మాదిదేవతలు పరాశక్తిని ప్రార్థించుట, ఆమెవారి ప్రార్థనను మన్నించి లలితా రూపమునంది మహాసామ్రాజ్య పట్టాభిషేకానంతరము "బృహత్సేనను" సమీకరించుకుని భండునితో యుద్ధమునకు సమాయత్తమగుట, జరిగిన కథ.

శ్రీదేవి తన సామ్రాజ్య రక్షణ భారమును మంత్రిణీయైన శ్యామలాంబ భుజస్కంధములపై మోపినది. భండాసురుని జయించగల జయత్సేనను చతురంగ బలమును సమకూర్చుకొనుచున్నది. సర్వసైన్యాధిపత్యమును వారాహీదేవికి, గజసేనావాహినికి సంపత్కరీ దేవిని అశ్వికదళములకు

మంత్రిణియైన శ్యామలాంబ, త్రివిధ దళాధినేత్రులైన సంపత్కరీ, అశ్వారూఢ, వారాహీ మొదలైన వారిచేత పరాభట్టారిక సైనిక వందనము స్వీకరించుచుండినది. వారు శ్రీదేవి యనుజ్ఞకొఱకై యెదురు చూచుచుండిరి.

భండుని పక్షమునందు అతని తమ్ములైన విషంగుడు, విశుక్రుడు కుమారులైన చతుర్బాహుడు మొదలు ఉపమాయువు వఱకు గల ముప్పదిమందితో కలిసి యుద్ధరంగమునకేతెంచెను. అతని వెంటకూడ కోట్లకొలది రాక్షసవీరులు పోరుకు సిద్ధముగా వచ్చియుండిరి. ఇరు పక్షములవారును ఎదిరి పక్షమందుగల సమవుజ్జీలను ఒక్కసారి పరికించి చూచుకుని తమతమ వ్యూహములను రూపొందించుకొనుచుండిరి. అమ్మవారు శంఖమును పూరించి శంఖనాదమును చేయుచుండగా యుద్ధము ప్రారంభసూచకముగా పరాశక్తిక్రోధాకారమైన అంకుశమునుండి పుట్టిన సంపత్కరీదేవి తన వాహనమైన రణకోలాహలముపై నుండి ఒక్కయదుటున గజయూథమును భండునిసేనపై కురికించినది. ఈ హఠాత్పరిణామమునకు, రణకోలాహలమునకు భండుని సేన దిగ్భ్రమకులోనై తేరుకొనులోపలనే శత్రుసైన్యమునకు విపరీత నష్టమును సంపత్కరీదేవి కలుగజేయుచున్నది.

కామేశ్వరి మొదలు చిత్ర వఱకు గల పదిహేనుమంది నిత్యాదేవతలు విజృంభించి దమన కాదులను అనిత్య దేవతలను దునుమాడిరి. అట్టిసమయమున వారు చూపిన పరాక్రమమును చూచి లలితాంబిక మిగుల యానందించుచున్నది. లలితాదేవి పుత్రికయైన బాలత్రిపురసుందరి తొమ్మిది సంవత్సరముల వయస్సులోనే భండాసురుని పుత్రులైన ముప్పదిమందిని మట్టుబెట్టినది. ఈ బాలశౌర్యమును చూచి అమ్మ మిక్కిలి సంతసించుచున్నది. మంత్రిణియైన శ్యామలాంబ భండాసురుని తమ్ముడైన విషంగుని సంహరించినది. దాన అమ్మ సంతసించుచున్నది. సర్వసేనానియైన వారాహీదేవి భండుని మరియొక తమ్ముడైన విశుక్రుని ప్రాణములననంతవాయువులలో కలిపివేసిన దృశ్యమును చూచి లలితాంబిక సంతోషాతిరేకమును ప్రదర్శించుచున్నది. వారాహీచేత హతుడైన విశుక్రుడు దేవతలను జయింపనెంచి వారి యుత్సాహమును నీరుగార్చుటకు జయవిఘ్నమను అస్త్రమును ప్రయోగించెను. దాని ప్రభావము వలన శ్రీదేవి సేనలో పోరాటపటిమకు అగ్ని పరీక్షయైనది. అప్పుడు శ్రీదేవి కామేశ్వరుని వంకజూచినది. అప్పుడు మహా గణేశుడుద్భవించెను. అతడు రాక్షసులు ప్రయోగించిన అనేక విఘ్నయంత్రములను త్రిప్పి కొట్టి వాటిని నిరుపయోగముగా చేయుచుండెను. మహాగణేశుడు యుద్ధములో చూపిన ధైర్యసాహసములకు లలిత మిగులసంతసించి యానందించుచున్నది. ఈవిధముగా తనయులను, తమ్ములను, ఆత్మీయులను, ఆంతరంగికులను, సర్వస్వమును పోగొట్టు కొన్నవాడై భండాసురుడు స్వయముగా శ్రీదేవితో యుద్ధమునకు తలపడెను. అతడు అమ్మవారిమీద అనేక యస్త్ర, శస్త్రములను ప్రయోగించుచుండెను. ప్రతిగా శ్రీదేవి కూడ అస్త్రశస్త్రములను వర్షించుచున్నది. అప్పుడు భండుడు సర్వాసురాస్త్రమును ప్రయోగించి సకల

# మంత్రరూపము

ఇపుడు జగన్మాత యొక్క మంత్రమయ రూపమును (సూక్ష్మరూపము) గురించి సంగ్రహముగా వివరించుచున్నారు. ఇంతకు ముందు వర్ణించిన స్థూలరూపమునకును నీ సూక్ష్మరూపమునకును అభేదమును కల్పించగా శ్రీ విద్యారూప పంచదశాక్షరిలోని మొదటి అయిదు బీజములు : క, ఏ, ఈ, ల, హ్రీం అనునవి వాగ్భవకూటమునకు జెంది లలితాంబిక స్థూలరూపములోని ముఖారవిందమునకు సమానముగా నున్నవి. కన్నులు, ముఖము పెదవులు, కంఠస్వరము, చెవులు కలిగి వాక్కునకుత్పత్తి స్థానమైనందున వాగ్భవకూటముగా చెప్పబడుచున్నది. ఇక్కడ శ్రీమత్ అనగా జ్ఞానభిక్షను పెట్టి భక్తులల్లో గల ద్వైతభావనను తొలగించి యేకత్వభావనను ప్రసాదించునది యని అర్థము. పంచదశిలోని మధ్యకూటము ఆరుబీజములు గలది. అవి : హ, స, క, హ, ల, హ్రీం అనునవి. అమ్మవారి మంత్రమయ సూక్ష్మరూపములోని మధ్యకూటమనునది స్థూలరూపములోని కంఠమునుండి నడుము వఱకు గల మధ్య భాగమునకు సమానము. దీనిని కామరాజ కూటమనెదరు. ఇక మూడవది శక్తికూటము. దీనిలో స,క,ల,హ్రీం అను నాలుగు బీజాక్షరములు ఉన్నవి. ఇది సత్పురుషుల యొక్క శక్తితో కూడి యున్నది. దీనిని లలితాంబిక తన కటి ప్రదేశమునకు దిగువ భాగమున కలిగియున్నది. "మన నాత్ త్రాయతే" ఇతి మంత్రః అను సూత్రమునననుసరించి మననము చేయుట మాత్రముననే రక్షించునది. మంత్రమనునది చతుర్విధ పురుషార్థములకును మోక్షమునకును మూలకారణము. అట్టి మహా మహిమాన్వితమైన పంచదశాక్షరియే మూల మంత్ర స్వరూపముగా గలది. ఈ మూల మంత్రమునందలి కూటత్రయమే శరీరముగాను ఈ బీజమే ఆత్మగాను కలిగియున్న చిద్రూపి శ్రీదేవి; పరమంత్రస్వరూపిణి. మూలాధార పద్మమునకు సంబంధించిన కర్ణిక నడుమ త్రికోణము గలదు, అది అగ్నితేజోమయము. ఆ అగ్నిమండలము పంచదశాక్షరీ విద్యలోని ప్రథమ కూటము. లలితాంబికకును, ఆ త్రికోణాంతర దీపికకును భేదము లేదు. అనాహత కమలము అనగా హృదయ స్థానమునందు సూర్యమండలము గలదు. శ్రీదేవి పంచదశివిద్యలోని ద్వితీయ కూటము అనగా కామరాజ కూటములో రవి రూపమున ప్రకాశించుచుండును. బ్రహ్మరంధ్రమునకు దిగువున సహస్రార కమల కర్ణికయందు చంద్రుడుండును. అతడు శ్రీ విద్యలోని తృతీయ కూటము అనగా శక్తి కూటస్థుడు. శ్రీదేవి యచట చంద్రునివలె అతనితో సమానముగా ప్రకాశించుచుండును. అందుచేతనే చంద్రనిభాయై అనిస్తుతించుచున్నాడు. ఈ పంచదశాక్షరికి శ్రీ కలిపిన యెడల శ్రీ షోడశాక్షరీ మంత్రమగును.

**వివరము :**

| | | |
|---|---|---|
| 1. వాగ్భవకూటము | 5 బీజములు. | క, ఏ, ఈ, ల, హ్రీం |
| 2. కామరాజు | 6 బీజములు. | హ, స, క, హ, ల , హ్రీం |
| 3. శక్తి | 4 బీజములు. | స, క, ల, హ్రీం |
| మొత్తం | 15 బీజములు. | |
| 4. శ్రీం | 1 | |
| | 16 షోడశాక్షరి. | |

ఈ శ్రీ శబ్దములోని 'శ' వర్ణము ఆనందము. రేఫము తేజస్సు. ఈం కామకలాబీజము బ్రహ్మాపదార్థము. చిద్రూపి యని యర్థము. ఈ మంత్రరాజమును గురుముఖతః మాత్రముననే నేర్చుకొనవలసియుండును.

యేర్పడుచున్నవి. కృతయుగముతో సృష్ట్యారంభము. పరమేశ్వరుడు జగదనుగ్రహముతో శ్రీ విద్యను గురు శిష్య భావమును బొంది తాను ఊర్ధ్వదేవనాథనామమును ధరించి కామేశ్వరికి మిత్రేశ దేవనాథయను దీక్షానామమునొసంగి ఆమెకుపదేశించినాడు. ఇదియే శ్రీ విద్యప్రథమోత్పత్తి ఆమెయు పరమేశ్వర సంకల్పానుసారము లోకములందు విస్తరింపదలంచి యోగ్యులకొఱకన్వేషించుచు మూర్తిత్రయ ద్వంద్వమునెంచుకొని ప్రథమముగా ఉమామహేశ్వరులకుపదేశించినది. వారు లక్ష్మీనారాయణులకు లక్ష్మీనారాయణులు బ్రహ్మసరస్వతులకు వారు ఓఘత్రయమునకు అనగా దివ్యౌఘము సిద్ధౌఘమునకు, వారు మానవౌఘములకు పరంపరగా ఉపదేశించి లోకములందు విస్తరింపజేసిరి.

**కామేశ్వరునుండి తన స్వంత గురువు వఱకు గురూపదేశ : పరంపర**

| పూర్వనామము | వారిపీఠము | కూటము/బీజము | దీక్షా నామము |
|---|---|---|---|
| కామేశ్వరుడు | ఓఢ్యాణమనే | | ఊర్ధ్వదేవనాథ |
| కామేశ్వరి | బిందు పీఠము | | మిత్రేశదేవనాథ. |
| ఉమ - మహేశ్వరులు | జాలంధర | శక్తి | ఊర్ధ్వదేవనాథ కామేశ్వరి. |
| లక్ష్మీ-నారయణులు | పూర్ణగిరి | కామరాజ | షష్ఠీశదేవనాథ వజ్రేశ్వరి |
| బ్రహ్మ సరస్వతులు | కామగిరి | వాగ్భవ | మిత్రేశ దేవనాథ భగమాలిని |
| ఇంద్రుడు | అమరావతి | - | |
| సనకుడు | - | - | |
| వ్యాసుడు | - | - | |

కామకలా విలాసము నుండి (గ్రహించబడినది)

స్కందుడు గోవర్ధనగిరి శ్రీ లాడర్మహర్షి (గురుపీఠం), శ్రీ సుబ్రహ్మణ్యాపరావతార సురళిమలై. శ్రీశ్రీశ్రీ లలితానంద సరస్వతి యతీంద్రులవారు.

నం. నందీశుండొకరుండె నీమహిమ గానంబోలు లేకున్న నా
నందం బొప్పగ నీశుతుల్యుడని నిన్ వర్ణింపగా నేర్చునే
మందాత్ముల్ నిను వేరు రూపముగ సంభావింత్రు లోకాన నా
రందల్ వేరెవరింక నిన్గనగ సుబ్రహ్మణ్య! చిద్రూపకా

ద దరహాసంబు మొగంబునన్ బరువులెత్తన్ వాక్సుధా మాధురుల్
నిరతంబున్ ప్రవహింప నీ యెదుట మన్నీలౌచు నిత్యంబు నా
సురలే సేవ యొనర్తు రనన్ శ్రుతి వచస్సుల్ మమ్ము నీ సేవలో
పరమానందముతోడ జేరుటకు సుబ్రహ్మణ్య! బోధింపవే.

స సరియెవ్వారలు నీకు దేవతలలో సర్వేశుడే తండ్రియౌ
గిరిజాదేవియె తల్లి సోదరుడు విఘ్నేశుండు పైపెచ్చు శ్రీ
హరులే యత్తయు మామయున్ ప్రథమ భృత్యశ్రేణి దేవాళి నె
వ్వరికిన్ గల్గెడు నిట్టి వైభవము సుబ్రహ్మణ్య నీకేతగున్.

ర రజ తాద్రిన్ గల సౌఖ్య సంపదలపారంబంచు మర్త్యాళి స్వ
ర్గజులున్ నిత్య శివార్చనల్ సలిపి దారానెంతురందుండ నీ
శజ గోవర్ధన పర్వతంబున వసించన్ వచ్చితే తావక
స్వజనా నీకముతోడనే ఘనతో సుబ్రహ్మణ్య! నీకెంచనౌ

స్వ స్వర్భూజంబును కామధేనువును నైశ్వర్యంబిలన్ తత్కృపా
నిర్భూంతంబని యెంచి గొల్చుదురు త్వత్ప్రేమన్ సురానీకముల్
నిర్భీతిన్ జరియించుచున్న నుడులన్ విన్నారొ లేదో నిజ
స్వర్భూమిన్ సుఖ మందు మాటలను సుబ్రహ్మణ్యనిన్ గొల్చుటన్.

తీ తీవల్ మ్రాకులు సత్సరోవరములున్ దేవుల్ జనుల్ జంతువుల్
భావంబందున తృప్తిజెంది తము సంభావించునన్ రీతిగా
పూవుల్ కాయలు రుచ్యతోయములు సంపూర్ణంబుగానిచ్చి
తద్రావస్ఫూర్తి జెలంగు నీదరిని సుబ్రహ్మణ్య నీప్రేమకై

# కుండలినీ రూపము

ఇంతవరకు బ్రహ్మాండాంతర్గత దేవీ రూపమును వర్ణించి ఇప్పుడు పిండాండాంతర్గత 'కుండలిని' యను పేరు గల సూక్ష్మ తమ రూపమును వర్ణించుచున్నాడు. బ్రహ్మాండమునకు సంక్షిప్త రూపమే మానవ దేహము. మానవ దేహమునందు 72,000 నాడులు గలవు అందు ఇడ, పింగళ, సుషుమ్నా నాడులు ముఖ్యమైనవి. ఇడా, పింగళులు సూర్య, చంద్ర నాడులు. సుషుమ్న పరానాడి. సాధకుని శరీరము నందు గల సహస్రారకమలాంతర్గత చంద్రమండలము సర్వ కారణబిందువు. అది శివస్వరూపము, తేజోమయము, మరియు పరమాత్మగా బుధజనులందరి యంగీకారము. పరానాడి సహస్రార కమల కర్ణిక నుండి కటిప్రదేశమునగల మూలాధారము వరకు వ్యాపించి యున్నది. ఇది పరాశక్తి స్వరూపము. ఈ నాడి యందు పరమాత్మ తేజస్సు జీవ సంజ్ఞను పొంది యున్నందున జీవనాడి. బ్రహ్మనాడి యని పిలువబడుచున్నది. ఇది పహస్రార కమలమునుండి ఆజ్ఞాకమలాది మూలాధారము వరకు గల షడ్చక్రములను, మూడుగ్రంథులను దాటుకొనుచూ పోయి అచట నాలుగు రేకులు గల పద్మకర్ణికామధ్యమున 'కులకుండల' బిందువు నందు సర్పాకృతితో మూడున్నర వరుసలలో ప్రదక్షిణ పూర్వకముగా చుట్టుకొని సదా నిద్రించుచుండును. దీనికే కుండలినియని సంకేతము. మూలాధారమునకు దిగువన ఎఱ్ఱని రక్త వర్ణము గలిగిన సహస్రదళ కమలము గలదు. దీనిని కుల పద్మమందురు. ఇది శక్త్యాత్మకము.

ఇచట కులసంకేతపాలిన్యైనమః అనుటచేత ముందుగా కౌళ మతమును గూర్చి చెప్పుచున్నాడు. కౌళమతమనగా వామా చారమె. భైరవఋషి. భైరవీ భైరవులధి దేవతలు. ఇందు శక్తితత్వము ప్రధానము. వీరికి అంతర్యాగములో మూలాధార, స్వాధిష్టాన కమలములందు పూజ ఆత్మలయాది కలాపములు కుండలనీ ఉపాసన, కుండలినీ ప్రబోధము అనగా వాయు బంధనము చేత కుండలినిని మేల్కొలుపుట మొదలగు బాహ్యార్చనలో వామహస్తముతో తర్పణాదికములు, పరశురామ సూత్రము ప్రకారము సురా, మాంసాదులతో పూజా కలాపము, ప్రత్యక్ష యోనిపూజ మున్నగు సంకేతములు గలిగి స్వాధిష్టాన కమలము (యోని చక్రస్థానము) కులగృహమని చెప్పుదురు. యోని చక్ర సంకేతముచే పరాశక్తి స్థానమని యెంచి చూ॥ "త్రికోణ రూపిణి శక్తిః బిందు రూప పరశ్శివః" అను సూత్రముననుసరించి స్వాధిష్టానమందు సర్వకారణ బిందువున్నదని అదియే జగదుత్పత్తియని అనుటచే పరా పూజాదికములు కలవారు ఉత్తరకౌళులు. పూర్వకౌళులు మూలాధారము కులగృహమని అదియే సర్వకారణబిందువని అచటనే లయ భావనాదులు కలవారు. ఇద్దరికీ స్వాధిష్టాన మూలాధారాదుల యందు లయ భావన భేదాలు తప్ప మిగిలిన విషయాలలో యేకీభవింతురు. ఈ వామాచారపూజ మాయా ప్రపంచ నిర్మాణము ఫలముగా గలది. యోగులకుగూడ మాయను కలుగజేయునది. కనుక హేయమైనది. వేదబాహ్యమైనది. మోక్షపు మార్గము గాదు. తుచ్ఛమైనది యీ కౌళ మార్గము. అయితే కౌళినీ

పైనున్న రుద్రగ్రంధిని త్వరిత గతిని చేరు చున్నది. భ్రూ మధ్యమునందు గల ద్విదళ పద్మమున గురుడుండుటచే ఆచక్రమునకు ఆజ్ఞాచక్రమని వ్యవహారము. ఇది మనస్తత్వ స్థానము. భర్తను సమీపించు చున్న కొలది, దూరము తగ్గినందున దేవి విశుద్ధి-ఆజ్ఞోపరిభాగమునందున్న రుద్రగ్రంధిని గూడభేదించుకుని పైనున్న సహస్రారకమలమునకు పయనించుచున్నది. అచటనుండి ఆనందోత్సాహముతో నాదబ్రహ్మముతోను, మంగళ ధ్వనులతోను అట్టహాసము చేయుచు స్వస్థానమైన సహస్రార కమలాంతర్గత చంద్రమండలమును చేరు చున్నది. అది సదాశివస్థానము. అది శివశక్తి సామరస్యము. అచటనుండి దేవి అమృతధారలు గురిపించి తనభక్తులకు అమరత్వము నొసంగు చున్నది. దేవి మెరుపు తీగతో సమానమైనది. అనగా మాయను, అజ్ఞానమును తొలగించు దివ్యజ్యోతిగా వెలుగొందుచున్నదని భావము. దేవి ఆరు చక్రములపైన గల సహస్రారమందు ప్రకాశించుచు. కామేశ్వరుని నామసారూప్యమును బొందుటయందు ఆసక్తి కలిగియున్నది. చివరగా ఆమె 'కుండలిని' యై అనగా కుండలములు ధరించి తేజోరూపముగా ప్రకాశించుచు తన భక్తుల కానందమును కలిగించుచున్నది.

## బ్రహ్మాండమునకు పిండాండమునకు(దేహమునకు) సారూపము-సామీప్యము

| బ్రహ్మాండము | పిండాండము |
|---|---|
| 1) క్షీరసాగరము. | సహస్రారగత చంద్రమండలము (సుధాసింధు) |
| 2) రత్నద్వీపము | 'దేహోరత్నద్వీపా' ఃయని దేహమే రత్నద్వీపము |
| 3) మహాపద్మాటవీ | అసంఖ్యాకములైన నాడులే మహా పద్మములు |
| 4) నవరత్నములు | ఇంద్రియములే నవరత్నములు. |
| 5) చింతామణి గృహము | తురీయావస్థయె. చింతామణి గృహము |
| 6) పంచబ్రహ్మాసనము | తురీయాతీతము - (పంచమావస్థ-'పంచమ్యై') |

# భక్తానుగ్రహము (భక్తసౌభాగ్యదాయిని)

అంబా, భవాని, లలితాంబిక తన నాశ్రయము కోరిన వారిని యేవిధముగా ఆదుకొనుచున్నది వివరించు చున్నాడు. ఆమెనాశ్రయించినవారికి సర్వసౌభాగ్యముల నొనగూర్చునది గాన భక్తసౌభాగ్యదాయని యని స్తుతించుచున్నాడు.

ఐశ్వర్యము, వీర్యము, కీర్తి, కాంతి, జ్ఞానము, విజ్ఞానము, అను నీ ఆరును భగమున కర్థములు. 'సుభగ శోభనమగు భగము కలిగినది సుభగ. సుభగనుండి యే సౌభాగ్యమగుచున్నది. ఈ సుభగ లలితయే మరి యెవరునూ కాదు. సుభగ, సుమంగళి, సువాసిని ఇత్యాదులైన పదములన్నియు శ్రీదేవికే అన్వయము. కాని వీటినన్నింటిని మనము మాతృమూర్తులైన పుణ్యస్త్రీల పరముగా వాడుట సామాన్యము. కనుక సౌభాగ్యమను శబ్దములో అంత గొప్పయర్థమిమిడి యున్నది. శ్రీమాత తన భక్తులకు పైనవివరించిన ఆరింటిని అనుగ్రహించుచున్నది. కనుకనే తరువాత వచ్చు నామములలో 'శ్రీ' కరీ యని స్తోత్రము జేయుచున్నాడు. శ్రీ యనగా లక్ష్మీయని అర్థము. తన భక్తులకు లక్ష్మీ కటాక్షమును కలుగజేయునది కనుక శ్రీకరియైనది. లక్ష్మీకటాక్షమున ఐశ్వర్యము అనగా భాగ్యము దానివలన కీర్తి, ధర్మము, జ్ఞానము, విజ్ఞానము, మొదలైనవి వానికవియే సంభవించుచుండుట మనకు లోకానుభవము. ఆమె కరుణా కటాక్షములు కలిగిన వ్యక్తికి లోకమునందసాధ్యమేదియును లేదు. అదిలేని వాడెందుకును కొఱగాడు. అందుచేతనే హరిశ్చంద్రుడంతటివాడు :

'ధర దొంగతనములో, దొరతనములో భాగ్యవంతునకేదైన బాధలేదు' అని వాపోయినాడు. ఆమె సౌభాగ్యమట్టిది. ఆమెకటాక్షములేనినాడు కులీనుడైనను నిర్వీర్యుడైపోవును.

శ్రీదేవిని భావనాగమ్యా యని స్తుతించుటచేత భావించుకొనినంతనే (తలంచుకొననంతనే) దయాంతరంగయై అక్కున జేర్చుకొనునది కాన తెలుగు వారామెను 'తలంపుల అమ్మ' గా అత్యంత శ్రద్ధాసక్తులతో కొలుచుచున్నారు. ఈ తలంపుల అమ్మ తూర్పు గోదావరి జిల్లాలో తుని నుండి అన్నవరం వచ్చే మార్గములో ఒక పెద్ద గుట్టపైన తలుపులమ్మగా వేంచేసియున్నది. పామరజనము సరిగా పలుకజాలనందున తలంపుల అమ్మ కాస్త అపభ్రంశమునొంది తలుపులమ్మగా ఆ ప్రాంత జనులలో ప్రసిద్ధి జెందియున్నది. పూజాది కార్యక్రమముల కంటె మనస్సే ప్రధానమైనందున సరస్వతీ పుత్రుల వలె స్తోత్రపాఠములతో మెప్పింపజాలని మా బోంట్ల తలంపులతోనే సంతుష్టి జెంది అనుగ్రహించుచున్నది. అమ్మను ఆరాధించుటకు యెక్కువ శ్రమ పడనవసరము లేదు. భక్తి శ్రద్ధలతో సేవించుకున్న వారికి ఆమె సాన్నిధ్యము సుకరముగా దొరుకును. అంతటి సులభురాలు కనుకనే మరల 'భావనామాత్ర సంతుష్ట హృదయాయై' యని స్తుతించుచున్నాడు. ఆమె సాన్నిధ్యము దొరికినచో యే కష్టములును ఉండవు.

భూతకాలమునందుగాని, భవిషత్కాలమునందుగాని, వర్తమానకాలమునందుగాని ఒకే పతికి సతియై యుండుటయను అనితర సాధ్యమైన పాతివ్రత్యము కలిగిన స్త్రీ. అటువంటి పాతివ్రత్యము ఒక్క పార్వతికే చెల్లినది. శివుని మొదటి భార్య సతీదేవి. దక్ష ప్రజాపతికూతురు. దక్షయజ్ఞములో తండ్రిచే అవమానింపబడి దానిని భరించజాలక ఆత్మాహుతియై మరల మేనకా హిమవంతుల కాత్మనందనయై పార్వతిగా జనించుట అందరికి తెలిసినదే. ఇట్టి పాతివ్రత్యమితరస్త్రీలలో సాధ్యము కాదు కనుకనే సాధ్వీయను నామము ఒక్క లలితకే చెల్లుచున్నది. ఇక ఆమెగుణగణములను వర్ణించుచున్నాడు: శ్రీదేవి మంగళప్రదమైన సుందర రూపమును కలిగియున్నది. ఆమె ముఖము శరత్కాలమునందలి చంద్రబింబముతో సమానముగా ప్రకాశించుచున్నది. భక్తానుగ్రహమును గురించి చెప్పుచు ఆమె ముఖారవిందమును పొగడుట కొంచెము విచిత్రముగ కనిపించినను శరచ్చంద్ర నిభాననా యనుటలో శరత్కాల చంద్ర చంద్రికలవలె జగన్మాత ముఖారవింద దర్శనభాగ్యముచేతనే తన భక్తులకు ఆహ్లాదమును కలిగించుచున్నదని భావము. ఆ ఆనందము తాత్కాలికముగాదు శాశ్వతమైనది.

లలితాదేవి నాశ్రయించిన వారికెట్టి యుపద్రవములు సంభవించవు. నీటియందుగాని, భూమిమీదగాని సంభవించు ప్రమాదములు, భీభత్సములు కలిగించు భయానక వాతావరణమునందు దేవి నామస్మరణము చేసినంతమాత్రముననే వాటివలన కలిగిన మనోవ్యధలు తొలగిపోయి అంతయు సుఖాంతమై మనమున ప్రశాంతత యేర్పడును. ఇదిలోకవ్యవహారమునకు సంబంధించినది. పారలౌకిక విషయమునగూడ భక్తునికనేకమైన అడ్డంకులు సంభవించుచుండును. అందులో ముఖ్యమైనది చిత్త చాంచల్యము. దానివలన మనో వైకల్యము కలిగిన యెడ : వానికి స్థిరచిత్తము ననుగ్రహించి బుద్ధినదుపులోపెట్టి వాని అంతఃకరణమును అదుపులో పెట్టును. తన్మూలముగా నతనికి అచంచలమైన విశ్వాసమేర్పడి తన గమ్యమును చేరుటకు సులువగుచున్నది. తల్లిని జేరిన బిడ్డకు ఇంకయేమి కష్టము. అటులనే మాత తన నాశ్రయించిన వారికి కలుగు సర్వభయములను పోగొట్టి వారికి యిహలోకమునందును, పరలోకమునందును శాశ్వతమైన సుఖములనిచ్చి వారిని ఆనంద పరచుచున్నది. శ్రీమాత శాంతమూర్తి. భక్తులందు శాంత స్వభావమును కలిగినదై వారియందు గల దుర్గుణములను తొలగించుటలో యెట్టి దుడుకు తనమును లేకుండ కడు నేర్పరి తనముతో గడుసుగా వ్యవహరించును. ఒకింత కాఠిన్యమునుపయోగించిననే మనము చక్కగా నగుదుము. నయముగా జెప్పిన పాలు త్రావనివాడు భయముతో విషమునైన సేవించునని పెద్దలు చెప్పుదురు. కనుక 'నయమెంతదోసకారియో' యని పూర్వ కవియొకరు చమత్కరించినారు. అమ్మ కఱకుతనముతో దోషరహితుడైన భక్తుడు సదాచార వర్తనుడై శాశ్వతముగా బంధమోచనుడగుచున్నాడు.

చిద్రూపి, పరబ్రహ్మస్వరూపము. దేవి 'నిరవయవ' గనుక నిర్గుణాయన బడుచున్నది. ఈ నిర్గుణోపాసన అసాధారణమైన ప్రజ్ఞావంతులకును, మహాతపస్సంపన్నులకును మాత్రమే సాధ్యపడును. వారికిని గురువనుగ్రహము అవశ్యమగుచున్నది. దైవ ప్రకృతి గలిగిన మహాత్ములు జ్ఞానయజ్ఞముతో అమ్మనారాధించి అమరత్వమును పొందుచున్నారు. కనుక ఈ ఉపాసనకు జ్ఞానము ప్రధానమై యున్నది. దేవిని చిద్రూపి, పరబ్రహ్మస్వరూపిణి యనిగదా వర్ణన. ఆమె నిత్య, సత్య మరియు త్రికాలా బాధ్యమైనందున చరాచరజగత్తు నశించినా ఎప్పటికిని శాశ్వతముగా ఉండునది. దేవికి నశింపులేనందున అక్షర పరబ్రహ్మముగా వ్యవహరింపబడుచున్నది. అట్టి అక్షర పరబ్రహ్మమును చేరుటకు ఓంకారమను అక్షరము ఆలంబనముగా పనిచేయుచున్నది. దేవి ఈ ఓంకారనాదరూపిణి యై యున్నది. ఈ ఆధారమును పట్టుకొనుటకు భక్తి అవసరము. భక్తికిని, జ్ఞానమునకును అభేదము. భక్తి, జ్ఞాన, వైరాగ్యము, ఇవి అన్నియు ఒక దాని కొకటి గొలుసులవలె అమరియుండును. వీనిని విడి విడిగా చూడరాదు. జ్ఞానము యొక్క లక్ష్యము జ్ఞేయభూతమైన మహాత్రిపుర సుందరి సాయుజ్యమును బొందుటయే కనుక ఆ ఓంకారమునే ఆలంబనముగా చేసికొని ధ్యానము నిలుపుటకు ఆమె అనుగ్రహమే పొందవలయును.

ఆదియందు ఓంకారశబ్దము నాద బ్రహ్మరూపముగావెలువడినది. దీనినే ప్రణవమని గూడ యందురు. ప్రణవములో 'మ' కారాంతమున నుండు నదినాదం. దేవి అట్టి నాదరూపములో ఉండునది. ఓంకారమునందు మూడు అక్షరములు కలిసి యున్నవి. అవి అ, ఉ, మ అనునవి. అకారము జాగ్రత్, ఉకారము స్వప్న, మకారము సుషుప్తియను అవస్థాత్రయమునకు సంకేతములు. ఈ ఓంకారమెక్కడ లయమగుచున్నదో అదియే తురీయస్థానము. అటులనే 712 నామమైన 'ఈ' వర్ణమునకు బిందువు చేర్చిన యెడల ఈం అను కామకలాసంజ్ఞయగుచున్నది. దేవి కామ కళా బీజ స్వరూపురాలు. ఇది విశ్వ, తైజస, ప్రాజ్ఞ, తుర్యులనబడే భగవద్రూపభేదములలో తుర్యుని తెలుపుచున్నది. "ఈం" బీజము మిక్కిలి రహస్యమైనది కావున గురువు ద్వారా మాత్రమే తెలియదగినది.

ఓంకారమునుచ్ఛరించునపుడు అకారము 'ఉ'కారమునందును ఉకారము మకారమునందును చివరకు మకారము తురీయమందును లయమగుచున్నవి. అనగా అవి సూచించు జాగ్రదాది అవస్థాత్రయమును, విశ్వతైజస, ప్రాజ్ఞలును, స్థూల, సూక్ష్మ, కారణ శరీరములను వారిత్రివిధ ప్రపంచములు తురీయములో లయమగుచున్నవి. అది సమాధిస్థితి. ఆ స్థితికి జేరిన వారిని అవధూతలందురు. వారు శివతుల్యులు. వారికి అహోరాత్రభేదములుండవు. అది నిర్వికల్ప సమాధి. మరి దేవిది అంతకంటె పై మెట్టు. అందుకనే తరువాత పంచమ్మెయని స్తుతించుచున్నాడు. ఇది సాధకులు, భక్తులు మున్నగువారు అంచెలంచెలుగా జేరవలసిన గమ్యస్థానమును గూర్చిన వివరణ సూక్ష్మాతి సూక్ష్మముగా మాత్రము. శ్రీమాత ఈ అంచెలన్నీ దాటిన పిదప మంచెపై నాసీనయై యుండును.

బ్రహ్మ వస్తువు. అసత్ యను మాయా స్వరూపము. దీనిలో మరల రూపము శివాంశము, నామము శక్త్యాంశము. నామరూపాత్మకమనగా శివశక్త్యాత్మకమనియే అర్థము. నామం శబ్ద బ్రహ్మము. ఆ శబ్దము పరా స్వరూపము అయియున్నది. కనుక బ్రహ్మ పదార్థమే నామ రూపాత్మకమైన మాయా ప్రపంచముగా గూడా నైనదని గ్రహించవలయును. అనగా దేవి నిత్యము, సత్యమునైన బ్రహ్మము, అసత్యమైనదైన మాయా ప్రపంచము రెండును తానే అయి యున్నదని అర్థము. అట్లు కాని యెడల 'సదసద్రూపధారిణ్యై' యని స్తుతించియుండడు. అదేవిధముగా మాయా వరణ ప్రభావముచేత సంసారమునందు చిక్కుకున్న జీవుడును - దేవుడును గూడ వేరుగాదు. ఈ ద్వైతభావన, జ్ఞానోదయమైన వెంటనే, జగత్తూ, యావత్తూ స్వప్నలోకమువలెనే తెరమరుగై పోవుచున్నది. అప్పుడు జీవునికిని ఈశ్వరునికిని భేదము లేదు. 'దేవి జ్ఞానదాయై' నందున తన నాశ్రయించిన వారికి అభేదజ్ఞానమును కలిగించి వారికి అద్వైత సిద్ధిని అనుగ్రహించుచున్నది. జ్ఞానిదృష్టికి అంతా బ్రహ్మమే. ద్వైతభావము లేదు కనుకనే అతడు 'అహంబ్రహ్మోస్మి' అని యనగలడు. ఇది శంకరాచార్యులు వారి అద్వైత సిద్ధాంతమునకు మూలసూత్రము. నిర్గుణం, అద్వైతము మున్నగు వాని గుఱించి సిద్ధాంతులు, వేదాంతులు అనేక గ్రంథములు రచించి యుండిరి. ప్రాథమిక విషయ పరిజ్ఞానము కొఱకు వాటిలోని సారాంశమును అవసరమైనంతవఱకు విహంగ వీక్షణముగా మాత్రము ఇక్కడ ప్రస్తావించడమైనది.

నిర్గుణా యనగా గుణములు లేనిదని గదాయర్థము. దేవికి ఏయేగుణములు లేవో తన నాశ్రయించిన వారిని ఏ విధముగా సరిదిద్ది వారిని పునీతులను చేయుచున్నదో యీ పాఠ్యాంశములో స్తుతించుచున్నాడు. దేవికి త్రిగుణములు, అరిషడ్వర్గములు మొదలయిన అవగుణములు ఏవియును లేవు. అన్నియు సుగుణములే. ఇక్కడనుండి యీ అంశము పూర్తి అయ్యేవఱకు చాలాభాగము నామాలు 'ని' వర్ణముతోనే ప్రారంభమగుచున్నవి. 'ని' వర్ణమును వ్యతిరేకార్థమును సూచించుటకు వాడుట సర్వులకు తెలిసిన విషయమే. ఉదా :- లోభము నిర్లోభము, మలము నిర్మలము ఇత్యాదులైనవి. ఈ నామముల సూచన ప్రకారము దేవికి ఏయే అవగుణములు లేవని చెప్పుచున్నాడో ఆమెనాశ్రయించిన వారికి గూడ ఆయా అవగుణములు ఉండరాదని కవి హృదయము. . భక్తులు కాని / సాధకులు గాని తమయందుగల దుర్గుణములను తొలుతనే విడనాడి పరిశుద్ధులు కానిదే నిర్గుణమును గుఱించి ఆలోచించినను ప్రయోజనముండదు.

దేవి పరిశుద్ధురాలు. ఆకాశమువలెనే అమ్మకూడ శుద్ధమైనది. ఆమె విశ్వవ్యాపియైనా ఆకాశము వలెనే యేది అంటకుండ తామరాకుపై నీటి బొట్టువలె స్వచ్ఛమై యుండును. అందువలననే148 నామములో 'నిత్యశుద్ధాయ'ని స్తుతించుచున్నారు. దేవి దోషరహితయై యున్నందున ఆమెయందన్నియు సుగుణములేగలవు. మాత పరిపూర్ణురాలు. గనుక తన నాశ్రయించిన వారిని గూడ పరిపూర్ణవంతులను

లేకుండచేయును. దేవికి యేచింతలు లేనందునతన నాశ్రయించిన వారి చింతితార్థములను తీర్చి వారికి చింతలు లేకుండ చేయుచున్నది. దేవికి యేవిధములైన అహంకారములు లేవు. ఇవి మాత్సర్యముక్రిందికి వచ్చును. ఇది కూడ అరిషడ్వర్గములలోనిదే. తన భక్తులలో గల అహంకారమును (మాత్సర్యమును) చంపివేయును. ఒక వస్తువును గాని, లేక-విషయమును గాని, యథాతథముగా చూడలేక పోవుటను మోహమందురు. ఇది కూడ అరిషడ్వర్గములలోని దుర్గుణములలో నొకటి, దేవికి యెవరియందును మోమాటము లేదు కనుక తనభక్తులలోగల మోహగుణమును నశింపజేయుచున్నది. ఈ వస్తువు నాది/ తనది, అనెడు కొంచెపుబుద్ధి కలిగినపుడు దానిమీద గల ప్రత్యేకమైన అభిమానమును మమత యని యందురు. దేవి అంతా తానేఅయి యున్నందున దేనిపైన ఆమెకు మమకారము ఉండదు. తనభక్తులలో గల అవాంఛనీయమైన ప్రవృత్తిని నశింపజేయుచున్నది. లలితాంబిక పాపరహితురాలగుటచే, తన భక్తుల పాపములను గూడ నశింపజేయుచున్నది. దేవి 'నిష్క్రోధా' ఈ క్రోధమనునది అరిషడ్వర్గములలోనిది. తనభక్తులలోగల అట్టిదుర్గుణమును నశింపజేయు చున్నది.క్రోధముపశమించిన యెడల మనస్సు కుదుటబడి శాంతించును. సర్వానర్థములకు కోపమే కారణమగుటచేత ముందు దానిని తొలగించిన యెడల, మిగిలినవి క్రమముగా అవియే తొలగిపోవును. తన దగ్గర అవసరమునకు మించి యున్నప్పటికి ఇతరులకిచ్చుటకు ఇష్టపడకపోవుటను లోభమందురు. లోభివానిని గుఱించిన కథలు మన తెలుగులో చాలా ప్రచారములో నున్నవి. ఈ లోభగుణము గూడ అరిషడ్వర్గములలోనిదే. దేవికి అట్టి లోభగుణము లేదు. తనభక్తులలోని లోభగుణమును నశింపజేయుచ్నుది. దేవికి సంశయములేవియునుండవు. సంశయములు లేనివాడు, సంశయములను దీర్చు వాడు గురువు. శ్రీదేవియే గురుమూర్తి(దీక్షిత) యై తనభక్తుల సందేహములనుదీర్చి స్వయముగా తానేమంత్రోపదేశము చేసి వారిని తరింప జేయుచున్నది. దేవికి పుట్టుక యే లేదు. అటులనే తననాశ్రయించిన వారికిగూడ జన్మరాహిత్యమును జేయుచున్నది. భవమనగా సంసారమనిగూడ అర్థము యుండుట చేత దేవి తనభక్తుల భవబంధములనుండి శాశ్వతముగా విముక్తులను జేయుచున్నది. దేవి సంకల్ప, వికల్పములకతీతురాలై యేకత్వస్థితి యందుండును గాన నిర్వికల్పా యనిస్తుతింపబడుచున్నది. దేవికి యేవిధమైన భేదభావములు లేనందున తన భక్తులలోగల భేద భావనను తొలగించి సర్వము భగవత్స్వరూపముగానే జూడ గలుగు నంతటి బ్రహ్మజ్ఞానమును కలుగ జేయుచున్నది. దేవి ఆదిమధ్యాంతరహితు రాలగుట చేత తనభక్తులను గూడ జనన మరణములనుండి తప్పించి వారికి అమరత్వమును కలుగ జేయుచున్నది. దేవి క్రియారహితురాలు. అందుచే ఆమెకు విధినిషేధములు వర్తించవు. ఆమెకు భ్రాంతి లేదు. తనభక్తులలో గల భ్రాంతిభావనను తొలగించుచున్నది. భ్రాంతి తొలగిననాడు జగన్మిథ్యాయని తెలిసిపోవు చున్నది. అది తొలగిన నాడు అంతాబ్రహ్మ మయమే.

# సగుణము

ఇప్పుడు దేవి సగుణ రూపమును వర్ణించుచున్నాడు. సగుణమనగా త్రిగుణాత్మకమైన చరాచరప్రకృతిగా ప్రకటీకృతమైనది. సర్వవ్యాపితము, సర్వశక్తి మంతము, సర్వజ్ఞత్వము ఇత్యాదులన్నియు దేవిగుణములు. నిర్గుణబ్రహ్మము గా భావన చేసి తరించలేని మన బోంట్ల నుద్ధరించుట కొఱకు తనలోని పరాతత్వమునకు యెట్టి భిన్నము రాకుండ దయా సింధువైన దేవియే వివిధ రూపములుగా దృశ్యమానమైన ఈ జగత్తును నిర్మాణముగా వించినది. అయితే అవిద్యా వ్యాసంగము వలన మనము ఈ జగత్తును - ఆమెనూ విడివిడిగా జూచుటకు అలవాటు పడియుంటిమి. ఇదియే ద్వైతబుద్ధి. దీని వలన ఈ ప్రపంచనిర్మాణమునకు ప్రధానకారణమైన మూల ప్రకృతిని విస్మరించుచున్నాము. అందువలన మనకు సంసారమేగాని (జనన మరణముల వలయము) దేవిసాయుజ్యము ప్రాప్తించుటలేదు. ఈభవ బంధముల నుండి శాశ్వతముగా .విముక్తి నొందుటకు ఈ లలితా సహస్రనామములలో స్తుతించబడిన దేవీ నామములలో దేనినైనను ఉపాసించి తరించవచ్చును. అవి ముక్తికి సోపానాలు.

ఇందులో సుమారు ముప్పది నామములు 'మహా' అను విశేషణముతో ప్రారంభమగుటను గమనించవచ్చును. మహతి యనగా గొప్పది అని యర్థము. అది యెంతటి గొప్పదనగా ప్రత్యక్షము అనుమానము, మొదలైన ప్రమాణములతో తెలియరాకున్నది. ప్రత్యక్షమనగా దృష్టాంతము. అనుమానమనగా హేతువు. దేవి యీ రెండింటికి చిక్కదు. హేతువు తర్కములతోనే ప్రత్యక్షానుభవము. ప్రత్యక్షము, ప్రమాణములకు తెలియరాకుండుటనే 'మహత్వమని' గూడ వ్యవహరింతురు. దేవి అట్టి మహత్వమును కలిగియున్నది. మహాయనుటచేత ప్రతి విషయమునందును దేవిని మించిన వారు లేరని యర్థము. ఉదా:- మహాపూజ్యా, మహాసత్వా, మహాభోగా ఇత్యాదులైనవి. సర్వ మంత్రములు, తంత్రములు, స్వరూపముగాను, సర్వ యంత్రములు ఆత్మగాను కలిగి తన్నారాధించువారియందు ప్రసన్న వదనయై యుండునది. ఆమె సర్వ జగత్తునందు వ్యాపించి యున్నందున జగదీశ్వరియై యున్నది. కొల్హాపురమునందు మహాలక్ష్మి, కాశ్మీరమునందు మహా సరస్వతి, ఉజ్జయనిలోని మహాకాళి మొదలయిన వారందరితోను లలితాంబిక అభిన్నురాలు. ఆయా దేవతా మూర్తులను అర్చనాదికముల చేత సేవించిన దేవి మిగుల సంతోషించును. శ్రీ విద్యా, మనువిద్యా, చంద్ర విద్యా మొదలైనవన్నియు లలితాంబిక రూపములే. వాటిలో యే ఒక్కదానిని ఉపాసించినను దేవి మిగుల సంతోసించును. ఘంటార్గళాది యంత్రములు, వామకేశ్వరాది తంత్రములు తన రూపముగా గలది. మహా తంత్రములైన జ్ఞానార్ణవము, కులార్ణవము మొదలయినవి. సర్వ యంత్రములలోను

శరణుజొచ్చిన వారిని తరింపజేయుటకు మాత్రమే తన విశ్వరూపమును ప్రదర్శించుచున్నది. సర్వము తనేయని (దేవియే) ఏకేశ్వరోపాసన చేయవలయును. గీతలో శ్రీ కృష్ణుడు చెప్పిన సూత్రం 'సర్వధర్మాన్ పరిత్యజ్యమామేకం శరణం వ్రజ' అనునది అన్ని వేళలా అందరికి వర్తించును. ఈ దృశ్యమానమైన జగత్తును వట్టి ఆభాసమాత్రమేనని తను దప్ప యెవరూ లేరని మనస్సుకు తెచ్చుకొనుటయే గాక ఆచరణలోకి తీసుకొనుటయే ప్రధానము. ఆచరణలోనికి రాని నీతి సూత్రాలు యెన్ని వర్ణించినా ప్రయోజనము శూన్యము. ఆచరణము వలన పట్టుదల దాని వలన నిరంతర సాధన, ఆపైన అమ్మ అనుగ్రహము మనకు ప్రాప్తము. ఇవి అన్నియు ఒక దానికొకటి ఆధారపడి యున్నవి. శరణాగతి అనగా ఆపాదమస్తకము సాష్టాంగ దండ ప్రణామము చేయుట ఒక్కటియే గాదు : మనసా, వాచా, కర్మణా, దాసోహం అగుట. ఆ విధముగా దాసోహమైన పిమ్మట వేరుచింతన లేకుండ నిరంతరము అభ్యాసముతో దేవీ ధ్యానమును చిరకాలము చేయగా ధ్యేయము సిద్ధించును. జీవితాంతము యే దేవతామూర్తిని ధ్యానించుచు గడిపిన ఆ దేవతాసాయుజ్యమే దేహాంతమునందు మనకు కలుగును. కనుక చిల్లరదేవుళ్ళను పట్టుకుని కూర్చొనకుండ అందరికంటె పెద్దదయిన శ్రీ లలితాంబికనే ఆశ్రయించినట్లయిన పునరావృత్తిరహితమైన ముక్తిలభించుననుటలో యెట్టి సందియును లేదు. త్రికరణశుద్ధిగా దాసోహమైన భక్తుని విషయములో దేవి పూర్తి బాధ్యత వహించుచున్నది కావున అజ్ఞానులమైన మనము సులభమార్గమైన సగుణోపాసన ద్వారానే ప్రయత్నము, అభ్యాసము; ధ్యానము చిరకాలము చేసిన యెడల దేవికి దయ గలిగి మనకు జ్ఞానోదయము కలిగించును. దాని వలన అద్వైతసిద్ధి, అమరత్వము పొందుదుము.

ఈ సందర్భములో పోతనామాత్యుడు తను రచించిన మహా భాగవతములో ఒక చిన్న పద్యము ద్వారా చక్కగా వివరించినాడు. దానిని ఇక్కడ గుర్తు తెచ్చుకొనుటలో దోషమేమీ ఉండదనుకుంటాము.

"నీ వారై నీ దెస తమ
భావంబులు నిలిపి ఘనులు భయరహితులై
ఏ విఘ్నంబులు జెందక
నీ వరలెడి మేటిచోట నెగడుదురీశా"

అనాహత కమలోపరిభాగమునందు విష్ణు గ్రంథి కలదు. అది లక్ష్మినారాయణులకు స్థానము. అందు రాజస గుణ ప్రధానుడైన తైజసుడను జీవుడు సూక్ష్మశరీరాభిమానియై భావా భావ ప్రతిబింబ సదృశమైన స్వప్నావస్థను బొందియుండును. దేవి అట్టి తైజసునితో వేరుగాక యుండునది. స్వప్నావస్థను బొందిన జీవుల సమిష్టిరూపుడైన హిరణ్యగర్భుని రూపమును కలిగియున్నది. విశుద్ధి - ఆజ్ఞోపరిభాగమునందు రుద్రగ్రంథి కలదు. అందు సత్వగుణ ప్రధానుడైన ప్రాజ్ఞుడను జీవుడు కారణ శరీరాభిమానియై స్పష్ట ప్రతిబింబ సదృశమైన సుషుప్తావస్థను కలిగియుండును. ప్రాజ్ఞాత్మికా యనుటచేత అట్టి లక్షణములు గల జీవుల సమష్టి భూతమైన రుద్రునితో అభిన్నురాలు. తరువాతది తురీయస్థానము ఇది ఈశ్వరుని స్థానము. గురు మండలమునుండి సహస్రారము వరకు లలాటమనబడును. అవస్థాత్రయము నతిక్రమించిన పిదప త్రిపుటి నశించి జ్ఞానమొక్కటే మిగిలి అఖండానందముననుభవించుచుండును. అట్టి స్థానమును బొందిన జీవుడు కొంచెము కూడ ద్వైతబుద్ధిలేని స్థితిలో సచ్చిదానందమగును. అట్టివాడే అవధూత యనబడుచున్నాడు. వాడు శివునితో సమానము. దేవిని తుర్యాయయని స్తుతించుటచేత అట్టి తుర్యానంద భవులకు ప్రసన్నమైనదని భావము. ఆ పైన సదాశివుని స్థానము. ఐదవది. ఇదియే శ్రీ మాతకు సరియైన స్థానము. అది సర్వావస్థలకు అతీతమైనది. దేవిని సర్వావస్థా వివర్జితాయనుటచేత ఆమె అన్ని అవస్థలు అతిక్రమించి పంచమావస్థారూపమునంది శివునితో సామరస్యమును బొందును. ఈ పైన జెప్పిన వన్నియు భగవద్రూపభేదములు. జీవుడు / సాధకుడు ఈ అవస్థాత్రయమునునతిక్రమించి, మూడు గ్రంథులు ఆరు చక్రములు దాటి సహస్రారాంతర్గత చంద్రమండలము నందున్న శివ-దేవ్యులను జేరవలయును. ఈ సహస్రారాంతర్గత చంద్రమండల రూప, సాక్షియను చిత్కల అ హం అని వ్యవహరింపబడుచున్నది. ఇది శివశక్త్యాత్మకము ఇదియే పరమపదము. ఇచట నుండి శివ శక్తి సామరస్యమున అమృతము వర్షించబడును. సాధకుడీ సుధాసృతిని గ్రోలుచు చిత్ర, విచిత్రానుభూతులతో అఖండానందము ననుభవించుచుండును. ఆ స్థితిని సాధకుడు మరల, మరల అనుభవించుచుండును.

# పంచ కృత్యములు

సృష్టి కర్త్రియనగా జగన్నిర్మాణమును చేయునది యని అర్థము. బ్రహ్మమనగా సృష్టి కర్తయగు ఈశ్వరుడే. 'ఇతడు సృష్టి కార్యమును నిర్వర్తించునపుడు రజోగుణప్రధానుడై ఉండును. ఇచట దేవి అతనితో కలిసి క్రియాశక్తియై సృష్టి కార్యక్రమమును నిర్వర్తించుటచేత బ్రహ్మరూపాయనబడుచున్నది.

జగద్రక్షణముచేత గోప్త్రీయనబడుచున్నది. గోవింద రూపమును గలిగిన విష్ణువు ఈశ్వరుడే. విష్ణువుయొక్క పని స్థితి. అనగా సర్వ జీవులను రక్షించుట. అట్టి రక్షణభారమును వహించుచున్నందున

కాని, ఆ వర్ణించిన కొద్ది పాటిదైనను ఆమె పాదరేణువులతో గూడ సరితూగదట. అనగా దేవి వేదాలకు, వేదాంతాలకు కూడ అతీతమైనదని భావము. దేవి పరిపూర్ణమైన పరబ్రహ్మస్వరూపము. ఆమె సమస్తమైన సుఖభోగములతో తులతూగుచూ చతుర్దశ భువనములకు నాయకురాలుగా ఉన్నది. ఆమె శక్తి త్రయరూపిణి. ఆమెకు ఆద్యంతములు లేవు. ఆమె నాదబ్రహ్మము. మరియు నామ రూపములు లేనిది.

దేవిని హ్రీంకారియని వర్ణించుటచేత సృష్టి, స్థితి, లయములను చేయునది యని నిర్ధారణగా చెప్పుచున్నాడు. హ్రీం అనగా లజ్జ లేక సిగ్గు అని కూడ అర్థము కలదు. దేవికియేమి? సిగ్గుయేమి? యని ఆశ్చర్యము కలుగవచ్చును. ఇక్కడ 'లజ్జ' ను సంస్కారముగా భావించవలయును. చెడును వినక, కనక, మాట్లాడకయుండుటయే సంస్కారము మరియు సంప్రదాయమును అగును. దేవి యట్టి సంత్సంప్రదాయమును కలిగియున్నది. దేవికి నింద్యములైన గుణములేవియు లేనందున సహజముగా వాటి విషయములో నియంత్రణ పాటించును,. తన నాశ్రయించిన వారిని గూడ నిషిద్ధములైన విషయములజోలికి పోకుండ అదుపులో పెట్టును. కనుకనే వెంటనే హ్రీమతి యని స్తుతించుచున్నాడు. సిగ్గును వదిలివేసిన వ్యక్తికి సంఘములో ఎట్టి గౌరవము లభించునది మనందరికి అనుభవమే. కనుక లజ్జ అనునది అత్యవసరమైన యోగ్యతమే. ముగ్ధకు సిగ్గు అందమును ద్విగుణీకృతమొనర్చును. దేవియొక్క ముగ్ధమనోహరత్వమును హృదయంగమములను - రమ్యా, రాజీవలోచనా, రతిరూపా రంజనీ, రామా ఇత్యాదులైన నామములతో పొగడుచున్నాడు. ఈ వర్ణనంతా హ్రీమతి విభూతిని ప్రశంసించుటయే. హేయోపాదేయవర్జితాయనుటలో దేవి పరబ్రహ్మ స్వరూపమును చెప్పుచున్నాడు. హేయోపాదేయములు రెండూ లేకుండుటయే బ్రహ్మపదార్థము యొక్క ముఖ్య లక్షణము. మనువు, కుబేరుడు, మహేంద్రాదులచేత పూజింపబడుచున్నదనుటచేత దేవియొక్క పరతత్వ మహిమను ప్రశంసించుచున్నాడు. దేవి లోకరక్షణార్థము దుష్ట శక్తులను, రాక్షసులను నశింపజేయుచున్నది. జ్ఞానులచేత ముముక్షువులచేత కోరబడుచు కామ కలా సంజ్ఞకలదియై దివ్య మంగళ రూపముతో మనోహరముగా నొప్పారుచు చల్లని తల్లియై సర్వలోకములకును మూలభూతమగుచున్నది. దేవి కరుణామయురాలు. దేవి తన భక్తులయందు దయ చూపుటలోను, వరదానము చేయుటలోను తనకు తానే సాటియైయున్నది. బ్రహ్మ, విష్ణువులతో పాటు నరులకు, సురలకు గూడ వరములనొసంగునది. భూభారమును, విష్ణువును గూడ మోయుచు శేషుడేవిధముగా చలించడో, అటులనే దేవి కూడ సమస్తమైన భువనములను మోయుచు యేమాత్రమును చలించుటలేదు. ఆమె విశ్వమునకంటె యధికురాలు. ఈ వ్యాసమును క్రింద చూపబడిన పటముతో జోడించి చదివిన గాని అమ్మ అంతస్తు మరియు ఆమె స్థానము బోధపడవు :-

# క్షేత్ర - క్షేత్రజ్ఞ స్వరూపము

క్షేత్రమనగా శరీరము, భూమి, పుణ్యక్షేత్రము, యాగశాల మున్నగు వాని కర్థములు వచ్చును. 'లీలా వినోదార్థము' ఈశ్వర ప్రేరితమైన మాయాశక్తి ప్రభావము వలన ఉత్పన్నమైన జగత్తు యావత్తు క్షేత్రముగనే వ్యవహరించబడుచున్నది. ఇది అంతః సృష్టి, బాహ్యసృష్టి యని రెండు విధములుగా నున్నది. మొదటిది మనస్సు, ప్రాణము, బుద్ధులతో గూడిన 'నేను' అను అహంకారికమైన శరీరాద్యుపాధి ప్రపంచము. రెండవది ఆకాశము మొదలు భూమి వఱకు వ్యాపించి యున్న స్థావర జంగమములు బాహ్య ప్రపంచముగాను తెలియబడుచున్నవి. అందు బ్రహ్మ పదార్థమే అనగా ఈశ్వర చైతన్యము జీవపదార్థముగా ప్రవేశించి వాటిని నిరంతరము నడిపించుచున్నది. ఈ క్షేత్రాలను అనుక్షణము కనిపెట్టియుండి వాటి రక్షణ భారమును వహించుచున్నది ఆయన చైతన్యమే ఈ క్షేత్రజ్ఞుడు (లు). కనుక క్షేత్రముననుసరించుకుని యున్న జీవుడు మరియెవరోగాదు. అతడు ఈశ్వరుడనియే గ్రాహ్యము. అనగా కోటానుకోట్లుగా కనిపించుచున్న ఈ జీవరాశి యావత్తు ఈశ్వరుని సమిష్టి రూపమే అయినందున జీవునికి ప్రత్యేక ప్రతిపత్తి యనుచు యేమియును లేదు. జీవుడు ఈ ఉపాధి ప్రపంచములందు తగుల్కొని తనెవరో తన ఉనికియేమో అను విషయములు మరిచి పోవుచున్నాడు. అందువలన అతనికి గల జ్ఞానముగూడ అంతవఱకే పరిమితమై పోవుచున్నది. అది మరల అతనికి తెలియపరచుటకొఱకు ఉపనిషద్విజ్ఞానమేర్పడినది. దానిని శంకరాచార్యులవారు సూక్ష్మముగా 'జీవోబ్రహ్మైవనాపరః' అని సూత్రీకరించినారు. అనగా ఈ జీవుడాయీశ్వరుడనియే. జీవేశ్వరులకును జీవజగత్తులకును యే మాత్రమును భేదములేదని తాత్పర్యము. జీవేశ్వరులకును, జీవజగత్తులకును ఐక్యానుసంధానమును గావించి సర్వము తానేయని తను తప్ప మరియేదీ కాదని తెలిసికొనుటయే స్వ-స్వరూపజ్ఞానమని, అపరోక్షజ్ఞానమని వేదాంతులు చెప్పుచున్నారు. అచ్చతెనుగులో చెప్పుకొనిన యెడల తన నిజరూపమును తాను తెలిసికొనుట యని దానికి అర్థము. జీవుణ్ణి ఈ ఉపాధి ప్రపంచమునుండి వేరుచేసి ఇదిగాదు నీ రూపము అదియేనని జ్ఞాపకము చేయుటయే జ్ఞానబోధ. ఈరెంటికి సంబంధించిన జ్ఞానమే నిజమైన జ్ఞానమని చెప్పబడుచున్నది. జీవుడు తన నిజరూపమును తెలిసికొనిన మరుక్షణము యీ ఉపాధులను నిరసించిబయట పడును. అప్పుడు ఈ ప్రపంచములు రెండునూ మృగతృష్ణలోని నీరు వలెనే వఠి ఆభాస మాత్రమే యగును. అదే విధముగ క్షేత్రము-క్షేత్రజ్ఞునికి సంబంధించినంతవఱకు క్షేత్రము గూడ ఆభాసమే యగును. క్షేత్రేశుడు, క్షేత్రపాలుడుకూడ ఈశ్వరుడే అయినందున అతనికి భిన్నముగా క్షేత్రముండదు. సకల భూతముల యందును లోపల

వాసినసుష్టించుటకునుపదేశించి సన్మార్గావలంబకులుగా ప్రవర్తింజేయుచున్నది. మాయాసంసారములోపడి తాపత్రయాగ్ని పీడితులైన భక్తులకు సంతోషమును కలిగించుటలో చంద్రచంద్రికలవలె పనిచేయును. అనగా వారి క్లేశములను నశింపజేయునదని భావము. అవిద్యారూపమైన తమోగుణమును నశింపజేయుచున్నది. అనగా తన భక్తులలో గల అజ్ఞానాంధకారమును తొలగించి వారియందు సుజ్ఞాన దీపికను వెలిగించుచున్నది. దేవియే జ్ఞానస్వరూపిణి జ్ఞానదాత కనుకనే చిత్త్యేయని స్తుతించబడుచున్నది. చితిః అనగా అజ్ఞానమునకు శత్రురూపమైన జ్ఞానమని యర్థము. అధియే పరమాత్మస్వరూపము. దేవి సృష్టి, స్థితి, లయలకు తానే కర్తయై శబలబ్రహ్మస్వరూపమాయాశక్తిగా కూడ ఉన్నందున ఇచట తత్పదలక్ష్యార్థమైన కేవల బ్రహ్మముగా నొక్కి వక్కాణించుచున్నాడు. ఇందులో ధర్మము మొదటిదైతే సర్వోత్కృష్టమైన ఆనందము రెండవది. లవరూపులైన బ్రహ్మాదులనుభవించుచుండు ఆనందముకంటే శ్రేష్టమైనది. కనుకనే సర్వదేవతల చేతను అర్చింపబడుచు అందరికి వందనీయురాలైయున్నది.

ఇక పుణ్యక్షేత్రములకు సంబంధించినంతవఱకు దేవిస్థానములైన కాశీ, కాంచీ, మధుర మున్నగు క్షేత్రముల స్వరూపురాలు శ్రీ లలితాంబికయే. కంచికామాక్షి, కాశివిశాలాక్షి, మధుర మీనాక్షులుగా ప్రసిద్ధిజెంది అమ్మ స్థిరనివాసమేర్పరచుకున్న ఆదివ్యక్షేత్రముల ప్రశస్థి వర్ణనాతీతము. కాశిలోనున్న దేవి విశాలాక్షిగా అన్నపూర్ణగా లోకప్రసిద్ధిజెంది పిపీలికాది బ్రహ్మపర్యంతము సర్వజీవులకును ఇంత అన్నమును పెట్టి పోషించుచున్న సంగతి అందరూ యెరిగిన సత్యము. కంచిలోనున్న కామాక్షి తన చల్లని చూడ్కులతో సర్వజీవులనుగాచేటి చల్లని తల్లిగా అందరు నమ్ముకున్న నమ్ముచున్న జగన్మాత. ఇక మధురలోనున్న మీనాక్షి మహాత్మ్యముకూడా అంతయే. ఈ మూడు శబ్దములకు అక్షరార్థమును యథాతథముగా చర్చించుటకు సువిస్తరమైన సంపుటములగును. ఈ మువురమ్మలనుగుఱించి యెఱుకగల వారిదివఱకే లెస్సగా యెరిగించియున్నందున యెరుకలేని మాబోంట్లు అంతకు మించి యేమి చెప్పగలరు.

**" ఓం నమశ్శివాయ "**



అక్షరములతో ప్రౌఢస్త్రీవలె వైఖరీ (పతివ్రత) నామమును కలిగియున్నది. ఇందు కుమారి, యోషిత్, పతివ్రత సంజ్ఞలు పై మూడునామములకు వర్తించుచున్నవి. బాలా త్రిపురసుందరి తొమ్మిది సంవత్సరముల ప్రాయముతో కుమారీ సంజ్ఞను, లలితా పరమేశ్వరి పదునైదు వత్సరముల ప్రాయము గలిగి యోషిత్సంజ్ఞతోను, రాజరాజేశ్వరి మహాత్రిపుర సుందరి పదునారువత్సరములకు పైబడి ప్రౌఢాంగనగాను, పతివ్రతాసంజ్ఞతో ఉన్నట్లుగా గ్రహించవలయును. ఆపైన యా పతివ్రతా మతల్లికి సరియైన స్థానము శివుని వామాంకము.

**పీఠములు :** దేవికి ప్రధానమైన తొలి గురు పీఠములు మూడు గలవు. అవి 1. జాలంధర పీఠము 2. పూర్ణగిరి పీఠము 3. కామగిరిపీఠము.

కృతయుగముతో నూతన సృష్టి ప్రారంభము. ఆ ఆరంభకాలమున సర్వానందమయ ఓడ్యాణపీఠమను బిందు మండలమునుండి పరమాత్మ స్వరూపుడైన కామేశ్వరుడు గురుశిష్యభావమును బొంది తాను ఊర్ధ్వానందనామమును ధరించి యీశ్వరికి శ్రీ విద్యా మహామంత్రమును లోక కళ్యాణముకొఱకుపదేశించినాడు. అక్కడనుండి కామేశ్వరీ హంస ద్వంద్వము ద్వారా జాలంధర పీఠస్థ శక్తి బీజాధిపతులగు ఉమామహేశ్వరులకుపదేశమైనది. వారి ద్వారా పూర్ణగిరి పీఠస్థ కామరాజబీజాధిపతులగు లక్ష్మీనారాయణ ద్వంద్వమునకును మరల వారినుండి కామగిరి పీఠస్థ వాగ్భవ బీజాధిపతులగు వాణీ - హిరణ్య గర్భులకును, ఆ బ్రహ్మసరస్వతులనుండి ఓఘత్రయమునకును తద్వారా లోకములందు పరంపరాగతముగా ఉపదేశమునంది ఈ చిద్విద్య విస్తరించినది. శ్రీదేవియే పై గురుపరంపరాక్రమములో కామేశ్వరి, వజ్రేశ్వరి, భగమాలినీలుగా గురుమూర్తియై విలసిల్లు చున్నది. ఈ ద్వంద్వత్రయ దీక్షానామములు, ఇతర వివరములు, మంత్రమయ రూపములో ఇచ్చియున్నందున పునరుక్తిదోషమగునని మరల ఇచట ప్రస్తావించుట లేదు. దేవి జాలంధరీపీఠమున విష్ణుముఖి నామమున పూజింపబడుచున్నది. దేవి ఓఢ్యాణపీఠమను బిందు మండలమునందుండునది. రహస్సు అనగా సురతము, యేకాంతమని అర్థములు గలవు. దేవి సహస్రారమందు శివునితో గూడి విహరించుచుండును. జ్ఞానాగ్నియందు ధర్మాధర్మములు, పుణ్యాపుణ్యములు మొదలైన తత్వములన్నింటిని హోమము చేయుట వలన అట్టి యోగి మోక్షమునందగలడు. దేవి రహోయాగ, రహస్తర్పణల ద్వారా ఆరాధించిన మిగుల సంతోసించి అట్టివారిని వెంటనే అనుగ్రహించుచున్నది. దేవి సర్వమునకును తానే సాక్షియైనందువలన తనకెవరును సాక్ష్యములేనందున విశ్వసాక్షిణియని కీర్తించబడుచున్నది.

కామకలా విలాసము నుండి (గ్రహించబడినది).

'దంష్ట్రోజ్వాలాయనమః' అని సహస్ర నామములలో స్తుతించిన విధముగా ఇచటనున్న దేవి జోగులాంబకు దంష్ట్రములు కలవు. ఈమె మహాశక్తి సమన్వితమైనది. జోగులాంబ మహాత్మ్యము, అలంపురం ప్రాశస్త్యములను తెలుపుటకు మరియొక ప్రత్యేక సంపుటిని వెలువరించవలయును గనుక యింతకుమించి చెప్పజాలము.

**2. శ్రీశైల భ్రమరాంబ :** ఈమె ద్వాదశజోతిర్లింగములలో ఒకటిగా ప్రసిద్ధిచెందియున్న శ్రీశైల మల్లికార్జున స్వామికి దేవేరి అయియున్నది. ఈ శ్రీశైలము కర్నూలు జిల్లాలో శ్రీగిరి పర్వతముపైన గలదు. 'శ్రీశైల శిఖరం దృష్ట్వా పునర్జన్మ నవిద్యతే' యని హామీ. ఈ విధముగా భారతదేశములో మరియే ఇతర పుణ్యక్షేత్రమునందును హామీ యివ్వబడియుండలేదు. శ్రీశైల శిఖరేశ్వరుని జూచినంతనే మరుజన్మముండదట. అంతటి మహా మాన్వితమైన క్షేత్రమును - క్షేత్రేశియైన శ్రీగిరి భ్రమరాంబికను పొగడుట మాబోంట్లకు యలవికాని పని.

**3. దాక్షారామము - శ్రీ మాణిక్యాంబ :** ఈ శక్తి పీఠము తూర్పుగోదావరి జిల్లాలోగల దాక్షారామమునందు గలదు. ఇది దక్షుడు యజ్ఞము చేసిన స్థలమని ఆయనపేరుమీదనే యున్నది. దక్షయజ్ఞము జరుగుచున్నప్పుడు తండ్రిచే అవమానింపబడి ఆత్మాహుతియైన సతీదేవి మరల జన్మించిన పిదప శ్రీమాణిక్యాంబగా ప్రసిద్ధిజెంది యిచ్చట నెలకొనియున్నది. పిలిచినంతనే పలికి భక్తుల యీప్సితార్థములను దీర్చు దేవిగా ఆ ప్రాంతప్రజలు ప్రగాఢ విశ్వాసమును కలిగియున్నారు. భీమేశ్వరుడు, సప్తగోదావరులు, మాణిక్యాంబల ప్రాశస్త్యమును శ్రీనాథమహాకవి తన భీమఖండమునందు ప్రస్తుతించియున్నాడు. అది ఆయనకే చెల్లినది.

**4. శ్రీ పురుహూతికా :** తూర్పుగోదావరి జిల్లాలోని పీఠికా పురమునందు పురుహూతికాదేవి రూపమున నెలకొనియున్నది. ఈమె శ్రీ కుక్కుటేశ్వరస్వామి దేవేరి. పీటలమ్మగా వ్యవహారిక నామముతో పిలువబడుచున్నది. అమ్మవారు రాత్రిపూట నగరమున సంచరించుచు శత్రు, చోర భయములేకుండ కాపాడుచుండును. అమ్మవారి నేత్రములు తీక్షణముగ నుండి చూపులయందు తీక్షత, దయా దృష్టి ప్రతిబింబించుచుండును. ఆకృతి అతిలోక సుందరమై యొప్పారుచుండును. లలాటమునందున్న తిలకము అతి ప్రకాశవంతమై లోకమునకు వెలుగును, తేజస్సును ప్రసాదించుచుండును.

---

**శ్రీ జ్ఞాన ప్రసూనాంబ** : శ్రీకాళ హస్తి : ఈ శక్తి పీఠము చిత్తూరుజిల్లాలో గల శ్రీకాళహస్తి పట్టణమున పవిత్రమైన సువర్ణముఖీ తీరమున గలదు. దేవి జ్ఞానదా, జ్ఞానగమ్యా అనిగదాయున్నది. పేరులోనే యున్నది జ్ఞానప్రసూనాంబయని, తన నాశ్రయించిన భక్తులకు జ్ఞానమును ప్రసాదించి వారికి అఖండమైన మోక్షలక్ష్మిని కలుగజేయుచున్నది. శ్రీకాళహస్తి మహాత్మ్యమును, జ్ఞానప్రసూనాంబను గుఱించె చెప్పుట ధూర్జటి మహాకవికే చెల్లినది. అట్టి దేవిని గుఱించి ముచ్చటించుటకు అల్పజ్ఞులమైన మాబోంట్లకు తరమగునా?

# అంగదేవతలు

దేవిని 'షడంగదేవతాయుక్తా' యనుట చేత, శిక్షా, కల్పాదిగా షడంగములతో కూడి యున్నదని చెప్పుచున్నాడు. అయితే యిచట షడంగములనగా (1) హృదయము (2) శిరస్సు (3)శిఖ (4) నేత్రములు (5) కవచము (6) అస్త్రములు గా తీసుకొన వలయును. దేవి యీ షడంగములకు సంబంధించిన దేవతాస్వరూపిణిగా గ్రహించవలయును. వారు క్రమముగా (1) హృదయ దేవత (2) శిరో దేవత (3) శిఖా దేవత (4) నేత్ర త్రయదేవత (5) కవచ దేవత (6) అస్త్ర దేవతలుగా ఉండి దేహేంద్రియములను సదాకాపాడుచున్నదని తెలియ వలయును.

ఆమె క్షేత్ర క్షేత్రజ్ఞపాలినిగదా

దేవిని షాడ్గుణ్య పరిపూరితా యనుట చేత ఆమె పరబ్రహ్మ స్వరూపము యొక్క పరిపూర్ణతను వెల్లడించుచున్నాడు.

**షడ్గుణములు :-** (1) ఐశ్వర్యము (2) ధర్మము (3) యశస్సు (4) శ్రీ (5) జ్ఞానము (6) వైరాగ్యము. ఈ ఆరు గుణములు యెవరియందుండునో ఆయన భగవత్స్వరూపుడు. భగము అనుశబ్దమునకివి నానార్థములు, ఇవి కలిగిన వాడు కనుక భగమంతుడు. దేవి యీ షడ్గుణములు తన యందు కలిగి యున్నందున పూర్ణాయైనది. ఐశ్వర్యమనగా తానను కున్నది సాధించగల సామర్థ్యమని అర్థము. దేవి అట్టి సత్తా కలిగినది కనుకనే తన భావానుకూలముగా చిత్ర, విచిత్రముగా సృష్టి రచనను చేయగలుగు చున్నది. అటులనే మిగిలిన గుణములు కూడ తనయందుండబట్టి దేవి భగవతి అయినది. శ్రీ మాత ధర్మవర్థిని కనుక ఆమె హృదయము యెల్లప్పుడు దయార్ద్ర గుణముతో నిండి యుండును. దేవికీర్తి అంతు లేనిది మరియు సాటి లేనిది కనుకనే యశస్విని యను చున్నాడు. దేవి సాక్షాత్తు లక్ష్మి స్వరూపురాలు. దేవి చిద్విద్యాస్వరూపురాలు. ఆమెయే జ్ఞానము. ఇంత సమగ్రమైన ఐశ్వర్యమును కలిగియుండియు దేవి చివరగా వైరాగ్యమును కూడ కలిగియున్నదట. అదియే విశేషము. లేనివాడు విరాగిగా మారుట లోకమునందు కందుము కాని, ఉన్నవాడు వైరాగ్యమును జెందుట కానము. ఆమె ప్రత్యేకత అది.

దేవి పరమశివుని అర్థభాగమునాక్రమించి యున్నది. కామేశ్వరి మొదలు చిత్రా వఱకు గల పదునైదు తిథి నిత్యల స్వరూపురాలై యున్నది. తనచుట్టూ అణిమాది ఆవరణ దేవతలతో దేదీప్యమానముగా వెలుగొందుచున్నది. అనగా దేవిది వారి స్వరూపమే అని భావము. చరాచర జగత్తునంతను సృజించి దానికి తానే ఈశ్వరి అయి యున్నది. అవ్యక్తా, వ్యాపిని, అని వాడుటచేత దేవి పరబ్రహ్మస్వరూపియై, మహత్వతత్వము, అహంకారమును గూడా తానే అయి ఉండి సర్వత్రా వ్యాపించి జగత్ప్రసిద్ధిజెంది యున్నదని కవి హృదయము. ఇంకను కొంచెము ముందుకు బోయి దేవిని వివిధాకారాయను చున్నాడు. దేవియే సర్వసృష్టికి కారణమై వాటి రూపముననున్నదని భావము. సృష్టి ఆరువిధములుగానున్నదని చెప్పబడుచున్నది. 1. తమస్సుయొక్క సర్గము 2. మహత్తుయొక్క

స్తుతించుచున్నాడు. ద్విజుడనగా రెండవ తూరి జన్మించు వాడని యర్థము. మానవుడు జన్మతః ద్విజుడుకాడు. గాయాత్రీ మంత్రోపదేశమై, ఉపనయనము, యజ్ఞోపవీత ధారణ మున్నగు వేదవిహితమైన కర్మకాండ జరిగిన తరువాతనే అతడు ద్విజుడగును. ఈ ద్విజశబ్దము, విప్రశబ్దము బ్రాహ్మణున కన్వయము. క్రైస్తవ మతము లో గూడ (క్రిజెండం) బాప్టిజం - కానిదే పుట్టుకతోనే క్రైస్తవుడు కాడు. అటులనే ద్విజుడైన తరువాత నుండి గాయిత్రీ ఉపాసన, సంధ్యా వందనము అనుష్టానము మొదలయినవి విధిగా ఒకదినచర్యలాగా చేయవలసి యుండును. గాయత్రీ జపము, ఉపాసన ద్విజులకు తప్పని సరియని వేదమాత గాయిత్రీ దేవి ఉద్దేశ్యము, నిర్దేశ్యము అయినందున శ్రీమాత ద్విజ బృందముచేతనే నిత్యము పూజింప బడు చున్నదని చెప్పుచున్నాడు.. ద్విజులు కానివారికి అటువంటి నిబంధనలు, నిర్దేశములు యేమీ లేనందున వారి వారి కులాచారము లేక వంశాచారముననుసరించి చేయుపూజలందు సంతుష్టురాలై వారికి గూడ తగిన పూజా ఫలమునందించుచున్నదని చెప్పుచున్నాడు. ద్విజులు కానివారిలో ప్రముఖులైన ఆదికవి వాల్మీకి, శుకయోగి, శ్రీకృష్ణుడు మున్నగువారు మనందరికి ఆదర్శప్రాయులై యున్నారు. వాల్మీకి మహాముని 'రామా' అని (319) సహస్రనామాంతర్గత మహామంత్రమును (తారకమంత్రము) జపించియే అంతటి వాడయినాడు. ఇక శ్రీకృష్ణుడు అమ్మవారి వలెనే షాడ్గుణ్య పరి పూరితుడు. భగవత్స్వరూపుడు. దేవి నామము అంతటి మహా మహిమాన్వితమైనది. దేవి తత్త్వమసియను మహావాక్యార్థ స్వరూపురాలు, సాక్షాత్తు పరబ్రహ్మమే అయియున్నది. కనుక సర్వులకు నమస్కారయోగ్యమై అందరి చేత పూజలనందు కొనుచున్నది. దేవి అందరికిని మాతృస్వరూపురాలు. కనుక అందరి చేత అమ్మాయని పిలవబడు చున్నది. అమ్మాయని యెవరు పిలచినా చివఱకు ఆవు అంబా యని అరచినా, అటుల సంబోధింపబడిన పదార్థములన్నియు దేవి స్వరూపములే అగు చున్నవి. సర్వస్త్రీ చిహ్నములు దేవి రూపములే అయినందున అమ్మా యని పిలచినపుడు అందరి అమ్మలగన్న మేటి పెద్దమ్మ ఆదిశక్తియే జవాబు ఇచ్చి అటుల సంబోధించిన బిడ్డల నాదుకుని వారి ఆపదలను బాపుచున్నది. దేవి పంచకాపూజ యందు పచకోశమంత్రాధిష్టాన దేవతా రూపమున ఉండునది. అవి శ్రీవిద్య, పరంజ్యోతి, పరా, నిష్కళ శాంభవి, అజపామాతృకలు. అనగా శ్రీదేవికిని ఆదేవతారూపములకును భేదములేదని భావము. మంత్రమయ రూపమున సుప్రసిద్ధ మంత్రవిశేషములచేత అర్చించబడుచుండుటచేత దేవి అపరిమితమైన మహిమలను కలిగి యున్నదిగా గ్రహించలయును. దేవి త్రిదశేశ్వరి. త్రిదశులనగా దేవతలు. వారు యెప్పటికిని ముప్పది సం॥ల యవ్వనవంతులై యుందురు. వారికి వార్థక్యాది వయోదశాభేదములుండవు. వారిరాణి కనుక త్రిదశేశ్వరి. ఆమె భూతభవిషద్వర్తమాన కాలములో యెప్పటికి యవ్వనవతియే. కనుక నిత్యయవ్వనా యని స్తుతించబడుచున్నది. ఈ యవ్వనమనునది రజోగుణ పరిణామము. శబలబ్రహ్మ మాయాప్రపంచ నిర్మాణమునకనువైనది. మదశాలిని, మద ఘూర్ణితరక్తాక్షి, మదపాటలగండభువే యనుచుండుటచేత నిత్య యవ్వన యెక్క సర్వానందమయాది భోగానుభవవిశేషములను తెలుపుచున్నాడు. మానవానందము, బ్రహ్మానందము సర్వానందములు ఆనందమునకు తరతమ భేదములు. బ్రహ్మాదులనుభవించు

# యోగినీరూపములు

'అ' కారము నుండి క్షకారము వఱకు గల మాతృకా వర్ణరూప యోగినీ గణములచేత పరివేష్టింపబడినదై, డ, ర, ల, క, స, హ, య అను ఈ ఏడు సంకేతాక్షరములతో విలసిల్లుచున్న శ్రీదేవి యోగినీ రూపములను తెలుపుచున్నాడు. ఇవి మాతృకోత్పత్తిననుసరించి విశుద్ధాదిగా అవరోహణ క్రమములో వచ్చుచున్నవి.

**1. ఢాకినీ** : పరదేవత విశుద్ధ కమల కర్ణికయందు నివసించుచున్నది. ఇది కంఠస్థానమునందు గలదు. దీని తత్వము ఆకాశతత్వము. వర్ణము తెలుపు వన్నెను గలిగియుండును. ఈ కమలమునకు పదునారు దళములు గలవు. దళమునకొకరివంతున పదునారు మంది యోగినులు దేవి చుట్టూ ఉందురు. వీరి నడుమనున్న దేవి అరి వీర భయంకరమైన ఢాకినీ యను నామముతో ఒప్పారుచున్నది. ఢాకినీ నామమునకు తగినట్లే దేవి అరుణవర్ణమును, త్రినేత్రములు యేకముఖమును గలిగి ఖట్వాంగాది ఆయుధములను కలిగియున్నది. ఖట్వాంగమును కఱ్ఱపై మనిషి పుఱ్ఱెను బిగించి చేయుదురు. దీనిని సామాన్యముగా మాంత్రికులు ధరించుచుండుటను సినిమాలలో గమనించియే యుందురు. ఈఢాకినీ దేవి పాయసాన్నమనిన మిగుల ప్రీతి గలిగి త్వక్ధాతువునకు (చర్మము) అధిదేవతయై యున్నది. దేవిని పశులోక భయంకరి యనుటచేత స్వస్వరూప జ్ఞానములేని పామరులు / పశువులనబడువారికి భయంకరమైనదని భావము. అనగా దేవి తననాశ్రయించినవారికి అభేదజ్ఞానమును కలుగజేసి వారికి అమరత్వమును కలుగజేయునని గ్రహించవలయును. అమృతాది మహాశక్తి సంవృతాయనుటచేత దేవి 'అ' వర్ణ రూప అమృతా మొదలగు పదునారుమంది మహాశక్తి సమన్వితులైన వీరాగ్రేసరులచేత సేవించబడుచున్నదని చెప్పుచున్నాడు. దేవి వీరులైన భక్తుల అభీష్టములను నెరవేర్చునది. శ్రీలలితా సహస్రనామములపై వచ్చిన భాష్యములన్నింటిలోను శ్రీ భాస్కరరాయలుచే రచింపబడినదియే అత్యంత మేలిమియై యున్నది. దేవి స్వరూపమును అతడు వర్ణించిన విధము సర్వజనామోదకరముగా నున్నది. దేవి భక్తుల సౌకర్యార్థము ఢాకినీ వర్ణనము ఇచట యివ్వబడుచున్నది.

శ్లో॥ గ్రీవాకూపే విశుద్ధౌ నృపదళ కమలే శ్వేత వర్ణాం త్రినేత్రాం
హస్తైః ఖట్వాంగ ఖడ్గౌ త్రిశిఖమపి మహా చర్మసంధారయంతీం
వక్త్రేణైకేన యుక్తాం పశుజనభయదాం పాయసాన్నైక సక్తాం
త్వక్స్థాం వందే మృతాద్యైః పరివృత వపుషాం ఢాకినీం వీరవంద్యాం

అనగా పైన జెప్పి లక్షణములన్నియు గలిగిన వీరాగ్రేసరియైన ఢాకినీ దేవికి వందనములని భావము.

శ్లో॥ దిక్పత్రే నాభిపద్మే త్రివదన విలస ద్దంష్ట్రిణీం రక్తవర్ణాం
శక్తి దంభోళి దండామభయమపి భుజైర్ధార యంతీం మహోగ్రాం,
డామర్యాద్యైః పరీతాం పశుజన భయదాం మాంసధాత్వైక నిష్టాం
గౌడాన్నాసక్త చిత్తాం పకల సుఖకరీం లాకినీం భావయామః

పైన వివరించిన విధమున సుప్రీతి, సుప్రసన్న సకల సుఖకరియైన యోగిని, లాకిన్యంబా రూపమున నున్న దేవిని యెల్లవేళలా తలంచుకొందును అని క్లుప్తముగా దాని అర్థము.

**4. కాకినీ** : పరాభట్టారిక స్వాధిష్టాన కమలమునందు నివసించుచున్నది. ఈ కమలమునకు ఆరు దళములు కలవు. దీనియందు దళమునకొక్కరియొంతున 'బ' నుండి 'ల' వఱకు గల ఆరు వర్ణముల రూపముననున్న యోగినులు దేవిని ఆశ్రయించి ఉందురు. ఈ కమలమునందున్న దేవి నాలుగు ముఖములతో మనోహరముగా నున్నది. శూలము మొదలయిన ఆయుధములను ధరించియున్నది. దేవి పసిమిచాయతో మిలమిల మెరసి పోవుచున్నది. తనకు గల సంపత్తి, సౌందర్యాతిశయములచేత దేవి మిగుల గర్విష్టియై యున్నది. దేవి మేధాధాతువునందభిమానియై దానికి అధిష్టాన దేవతగానున్నది. అనగా దేవి బుద్ధిరూపమున ఉన్నదని భావము. దేవి మధుపానమునందమితమైన ప్రీతిని కలిగి యున్నది. బందిని మొదలు లంబోష్ఠి అనునంతవఱకు గల ఆరుమంది యోగినీ పరివారముతో గూడియున్నది. దేవికి పెరుగన్నమనిన మిగుల యిష్టము. అటుల సకలైశ్వర్య సమన్వితమై స్వాధిష్టాన కమలమునందున్న దేవి కాకినీయను నామముతో చక్రేశ్వరీ రూపమును ధరించియున్నది. ఆమెను గురించి భాస్కరరాయలు చేసిన భాష్యమును పరికించుదము. ఇచట దేవి అగ్ని రూపమగు శక్తిగా కాకినియై యున్నది.

శ్లో॥ స్వాధిష్టానాఖ్య పద్మే రసదళ లసితే వేదవక్త్రాం త్రినేత్రాం
హస్తాభ్యాం ధారయంతీం త్రిశిఖగుణకలాపాభయాన్యాత్తగర్వాం
మేదోధాతు ప్రవిష్టా మళి మదముదితాం బందినీ ముఖ్యయుక్తాం
పీతాం దధ్యోదనేష్టామభిమత ఫలదాం కాకినీం భావయామః

పైన పేర్కొన్న స్వరూప, స్వభావములతో విలసిల్లుచున్న కాకినీయను యోగినీరూప చక్రేశ్వరిని తలంచుచున్నానని భావము.

**5. సాకినీ** : పరదేవత మూలాధార కమల కర్ణికయందధివసించి యున్నది. ఈ కమలము నాలుగు దళములతో పృధ్వీతత్వ ప్రకృతిని, రక్తవర్ణమును కలిగియున్నది. దీని నాలుగు దళములలోను,

శ్లో॥ భ్రూమధ్యే బిందు పద్మే దళయుగ కలితే శుక్ల వర్ణాం కరాబ్జైః
ర్బిభ్రాణాం జ్ఞానముద్రాం డమరుక కమలా మక్షాలాం కపాలం
షడ్వక్త్రాధార మధ్యాం త్రినయన లసితాం హంస వత్యాది యుక్తాం
హరిద్రాన్నైక సక్తాం సకల శుభ కరీం హాకినీం భావయామః

పైన వివరించిన్వరూప స్వభావములు కలిగి సకల శుభములను తనన్నాశ్రయించిన వారికి అనుగ్రహించు దయామయి హాకినీ నామ చక్రేశ్వరీ రూప పరా దేవతను ధ్యానించుచున్నానని దాని భావము.

**(7) యాకినీ** : సహస్రదళ పద్మస్థా యనుటచేత దేవి బ్రహ్మరంధ్రమునకు దిగువనున్న సహస్ర దళకమల కర్ణికా మధ్యమున స్థిరమైన వాసము గలిగినదని చెప్పుచున్నాడు. ఆమె సర్వ వర్ణములలోను(రంగులు) ప్రకాశించుచున్నది అనగా ఇంతకు ముందు చెప్పబడిన నీలిమేఘశ్యామమునుండి శుక్లవర్ణా అనునంత వఱకు గల అన్ని రంగుల యందును ప్రకాశించుచున్నదని భావము. అటులనే దేవి సర్వాయుధములను అనగా దంభోళి, శక్తి, అంకుశము ఇత్యాదులైన వన్నియును ధరించియున్నది. శుక్లధాతువునందు అభిమానమును కలిగినదై అందు జీవరూపముననున్నది. సర్వతో ముఖి యనుటచేత దేవి అన్నివైపుల ముఖములు కలిగి సర్వత్రా వ్యాపించియున్నదని చెప్పుచున్నాడు. దేవికి పాయసాన్నము మొదలు పులిహోర వఱకు గల అన్నివిధములైన అన్నములు ప్రీతిని కలిగించుచున్నవి. దేవి అకారాధిగా క్షకారాంతము వఱకు గల పంచాశద్వర్ణరూప యోగినీ గణ పరివేష్టితయై వారిచే పూజలందుకొనుచున్నది. ఈ సహస్రార కమలమునందుగల చంద్రమండలము సదాశివుని స్థానము. అదియే దేవికిని స్థిరనివాసము భాస్కరరాయలు 'పరశివరసికాం యాకినీం' అనుటలో దేవి అక్కడ చంద్రమండలమునందు శివసామరస్యమున తేలియాడుచున్నదని అచటనుండి వర్షించుచున్న సుధాసృతిని గ్రోలుచు సాధకుడు లేక భక్తుడు బ్రహ్మానందముననుభవించుచుండునని తెలియవలయును. యాకిన్యంబను భాస్కరరాయలు స్తుతించిన విధమును పరిశీలించుదము.

శ్లో॥ "ముండవ్యోమస్థ పద్మే దశశతదళకే కర్ణికా చంద్ర సంస్థాం
రేతో నిష్టాం సమస్తాయుధ కలితకరాం సర్వతో వక్త్ర పద్మాం
ఆదిక్షాంతార్ణ శక్తి ప్రకర పరివృతాం భవానీం
సర్వాన్నాసక్త చిత్తాం 'పర శివరసికాం యాకినీం' భావయామః

సర్వోత్తమమైన రూపసౌందర్యము, సర్వోత్కృష్టమైన గుణ గణములయొక్క ఆధిక్యతతోను ధీరోదాత్తయైన దేవిని పైన తెలిపిన విధముగా మహాయోగినీ రూపమున నున్న లలితాంబికను యెల్లవేళలా తలంచుకొనుచుందునని భావము. సహస్రాంతర్గత చంద్రమండలము సుధామయము. అదియే సాక్షిస్థానము. అచటనుండి దేవి అమృతధారలు వర్షించుచుండును.

| | |
|---|---|
| 10. నాభి | అంతరిక్షము |
| 11. చెవులు | దిక్కులు |
| 12. శిరస్సు | బ్రహ్మ |
| నాడులు | 14 |

ఇళా, పింగళ, సుషుమ్నా ఇత్యాదులు.

దేహములోని ముఖ్యమైన భాగములు ముప్పది మూడు.

వాటికి అధిదేవతలు కూడ ముప్పదిమూడు.

| | | | |
|---|---|---|---|
| నాడులు | 14 | ఆదిత్యులు | 12 |
| అవయవాలు | 12 | రుద్రులు | 11 |
| ధాతువులు | 7 | వసువులు | 8 |
| | | అశ్వనీదేవతలు | 2 |
| మొత్తము | 33 | మొత్తము | 33 |

ఈ దేహము ముప్పయిమూడు తత్వములు గలిగియున్నది. అండ, పిండ, బ్రహ్మాండములను నిండి సర్వజీవులను గాచునది సర్వేశి, దేవియే. బ్రహ్మాండము, పిండాండము, శ్రీచక్రములకు భేదము లేదని, బ్రహ్మాండమునకు సంక్షిప్తరూపమే మానవదేహమని మొట్టమొదటి వ్యాసములలో చర్చించుకొంటిమి. ఇప్పుడు యోగినీ రూపములను పరిశీలించిన తదుపరి అవగాహనయగునది యేమనగా సర్వదేవతలును మనదేహములోనే ఉండిరనియు వారినన్వేషించుటకొఱకు యెక్కడకు పరుగిడునవసరములేదనియు, సర్వదేవతా స్వరూపమే దేవి అనియును. దేవిని మన ఆత్మయందే సాక్షాత్కరించుకొనవలయునని తద్వారా సగుణమునుండి క్రమముగా నిర్గుణ బ్రహ్మమునుబొంది తరించవలయునని చెప్పకనే చెప్పుచున్నాడు. సహస్రనామము మొత్తం అంతా అద్వైతమును గుఱించియే బోధించుచున్నది. దేవి తన భక్తులలోగల ద్వైతబుద్ధిని (అనగా జీవుడు వేరు, ఈశ్వరుడు వేరు అని తలంచుటను) తొలగజేసి వారికి బ్రహ్మజ్ఞానమును కలుగజేయుచున్నదని అనుక్షణము మనకు గుర్తు చేయుచున్నది. దేవియొక్క అనుగ్రహము కొఱవడిన వేళ మహాయోగీశ్వరులైనను పిల్లిమొగ్గలు వేయక తప్పదని హెచ్చరించుచున్నది. ఈదేహమునేనని అభిమానమును వీడి దానిలోని ప్రతి అణువునందును దేవియే ఉన్నది కనుక అంబను మాత్రమే వీక్షించవలయునని బోధన జేయుటయే ఈ యోగినీ విభాగముయొక్క సారాంశము.

రెండవది అమంగళము. దేవి ఈరెండు రూపములందున ఉండి శుభాశుభ కార్యక్రమములను తిలకించుచున్నది. అమతిః ఇది మతిలేమితనము. అవిద్యా స్వరూపము. దేవి యీస్వరూపమున ఉండి దురాచార పరులకు స్వ-స్వరూప జ్ఞానమును కలుగనీయుట లేదు. మేథా అనునది కాశ్మీరదేశమునందు గల మహాసరస్వతీ పీఠస్థురాలగు జ్ఞానసరస్వతీదేవి. ఇది మన దేశమునందుగల పదునెనిమిది శక్తి పీఠములలోనొకటి. శ్రీదేవి యీరూపమునందుండి తన భక్తులకు ఆత్మజ్ఞానమును కలుగజేసి వారికి అద్వైత సిద్ధిని ప్రసాదించుచున్నది. శృతి : వేదములు అపౌరుషేయములు. అవిశ్రవణయుక్తమైనందున వినుటవలకే. దేవి శ్రవణాత్మమగు ఈ శృతుల రూపమున భాసిల్లుచున్నది. స్మృతి : అనగా జ్ఞప్తి యందుంచుకొనదగినది అని అర్థము. దేవి అట్టి స్మరణ స్వరూపురాలు. మరియు మనుస్మృతి, పరాశరస్మృతి మున్నగుధర్మశాస్త్రములు కూడ స్మృతులే యనబడును. ఇవి మానవులందరికిని సమ్యగ్దృష్టి, సమ్యగాజీవనము కలిగించుటకు విధి, నిషేధములు యేర్పరచినవి. వీనిననుసరించుటవలన లోకములందు గల జనులు ఇహపరసౌఖ్యములనందగలరు. కావున దేవి యెప్పటికి జ్ఞప్తియందుంచుకొనదగిన అట్టి ధర్మశాస్త్రములస్వరూపమునందు మానవుల జీవయాత్ర కొఱకు మార్గమును సుగమము జేయుచున్నది. దేవతలయందు శ్రీదేవిని మించినవారు యెవరూ లేనందున అనుత్తమా యని కీర్తించబడుచున్నది. ఆమెనే ఉత్తమురాలు. అంతకంటె ఉత్తములు ఆమెను రెండవశ్రేణికి నెట్టగలిగిన వారెవరునూ లేరని భావము. దేవియొక్క చరితములు, మహిమలు సర్వోత్కృష్టమైనవి. వానిని వినినను కీర్తించినను భక్తుల పాపములను పారద్రోలి వారిని పునీతులను జేయును. ఫలాపేక్షలేకుండ కేవలము బ్రహ్మార్పణభావముతో అనేక పుణ్యకార్యములు చేసిన వారికి మాత్రమే దేవి యనుగ్రహము లభించును. దేవి పుణ్యమును కలిగించు నామ, శ్రవణ కీర్తనాదులు కలది. అనునిత్యము దేవి నామములను పలికినను, వినినను, కీర్తించినను అట్టివారికి దేవి జ్ఞానభిక్షను పెట్టి వారిని తరింపజేయుచున్నది. ఇంద్రుని భార్య శచీదేవి పులోముడను ఋషి కూతురు. దేవి ఆమెచేత పూజింపబడుటచేత పులోమజార్చితా యనబడుచున్నది. దేవి అట్టి విశేషణ పూర్వకమైన కులీనులచేత పూజింపబడుచుండుటచే ఆమె అర్హత ఎవరికి రాదని గ్రహించవలయును. దేవి తన భక్తులను వారికి సంభవించు ఘోర విపత్తులు అనగా కారాగారాది బంధనము, సంసారబంధము మొదలయిన వానినుండి విమోచనులుగా చేయుచున్నది. పరబ్రహ్మమునందు గల స్ఫురణ శక్తికి విమర్శనము అందురు. సర్వాత్మ స్వరూపుడైన పరమాత్మ తన యందుగల విమర్శశక్తిని సర్వజీవులయందును ప్రవేశపెట్టి వానికి వస్తువివేచనా జ్ఞానమును కలిగించుచున్నాడు. అట్టి విమర్శనాజ్ఞానముచేత మానవుడు సదసద్వివేక సంపన్నుడై, సర్వ విపత్తులనుండి విముక్తుడై శాశ్వతానందమును బొందుచున్నాడు. దేవి అట్టి సర్వోత్తమమమైన విమర్శ రూపముతోనే తన యాశ్రితులలోగల ద్వైత భావనను తొలగగొట్టి వారికి అద్వైత సిద్ధిని కలుగజేయుచున్నది. దేవి తన

ఉద్ధరించుటలో దుష్టులను నిరంకుశముగా అణచివేయునని భావము. భండాసురునితో జరిగిన యుద్ధములో సర్వ రాక్షస సంహారము గావించునపుడు దేవి అనుసరించిన వైనము దీనికి తార్కాణము. దుష్టులను శిక్షించుటయందే గాకుండ తన నిజభక్తులయందుగల దుర్గుణములను బాపుటయందు గూడ దేవి తీరు నిరంకుశముగానే యుండును.

ఇప్పుడు దేవి సాన్నిధ్యమును జేరుటకు కావలసిన అర్హతలను చెప్పుచున్నాడు.
మైత్రి, కరుణ, ముదిత, ఉపేక్షయను నీ నాలుగును వాసనా చతుష్టయమనబడుచున్నవి. ఇవి భక్తుని చిత్తమును శోధించి నిర్మలమొనరించి దైవసాన్నిధ్యమును జేరుటకు తగిన పాత్రతను సమకూర్చుటలో సాధనభూతములగుచున్నవి. సౌఖ్యములననుభవించు వారియందు స్నేహభావముతో ఉండుటను మైత్రియందురు. దుఃఖితులలయెడ దయచూపుటను కరుణయందురు. పుణ్యాత్ములను జూచి సంతసమొందుటను ముదిత యందురు. పాపులను జూచి మిన్నకుండుటను ఉపేక్ష అని అందురు. ఈ నాలుగు సద్గుణములు యేభక్తుని యందు సమృద్ధిగా ఉండునో అట్టి పుణ్యాత్మునికి దేవి సులభముగా ప్రసన్నమగుచున్నది.

ప్రళయకాలమునందు శివుడు చేయు విలయ తాండమునకు దేవి యొక్కతెయే సాక్షిగా నిలచునది. ఆకాశాది పంచభూతములు, వివిధసృష్టులు, బ్రహ్మాది దేవతలు సర్వం సంహారమగును. అప్పుడు పరాశక్తి ఒక్కతే ఉండును. కావున ఆమెయే మహా ప్రళయమునకు సాక్షియనుచున్నాడు. ప్రతి జీవియందును గల సమస్త ధాతువులకు సత్తానిచ్చి వాని కదలికలకు ఆధారభూతురాలు అగుచున్నందున దేవి పరాశక్తి యనబడుచున్నది. పరాశక్తి యనగా పరమోత్కృష్టమైన శక్తిమంతురాలని గ్రహించవలయును. బ్రహ్మజ్ఞానమును పరానిష్టాయందురు. దేవి అట్టి మోక్షసాధనీభూతమగు జ్ఞాన నిష్ఠా స్వరూపురాలు. కన్నులు, చెవులు మొదలైన జ్ఞానేంద్రియములు యే శక్తి వలన కనుట, వినుట మొదలగు వాటి ధర్మములను సక్రమముగా నిర్వర్తించగలుగుచున్నవో దానికి ప్రజ్ఞానమని పెద్దలు నిర్ణయించిరి. ఈ ప్రజ్ఞానమనునది బ్రహ్మస్వరూపము గనుక 'ప్రజ్ఞానం బ్రహ్మ' అని శృతుల ద్వారా తెలియుచున్నది.

చూ : 'యేనవా రూపం పశ్యతి; యేనవా శబ్ద శృణోతి
ఇత్యాదినా ప్రజ్ఞాన లక్షణ ముక్తం'

పరబ్రహ్మ స్వరూపురాలైన దేవి అట్టి ఘనమైన ప్రజ్ఞానరూపముగా ఉన్నదని చెప్పుచున్నాడు. మాధ్వీపానమనునది ద్రాక్ష సంబంధికాదు. అన్యమైనది. దివ్యమైనది. దేవి అట్టి దివ్య పుష్పాసవాది పానములచేత పరవశత నొంది పరిపూర్ణమైన బ్రహ్మానందానుభూతితో ప్రమత్తురాలై యుండునది. ఇది దేవి యొక్క వైభోగమును, ఐశ్వర్యమును సూచించుచున్నది. అ నుండి క్ష వఱకు గల ఏబది వర్ణములు మాతృకాశక్తి స్వరూపములే అయినందున దేవియొక్క వివిధ యోగినీ రూపములను అవి సూచించుచున్నవి.

తదుపరి హృదయమునందు కామరాజ బీజ స్వరూపములో ఉన్నది. ఇది శ్రీ విద్యలోని ద్వితీయకూటము. రవిమండలము. దేవి ఇచట మిత్రరూపమున ప్రకాశించుచున్నది. ఆ తరువాత స్వాధిష్ఠాన కమలములో త్రికోణాకృతిని జెంది అగ్ని తేజస్సుతో ప్రకాశించుచున్నది. ఇది శ్రీ విద్యలోని ప్రథమ కూటము. అగ్ని మండలము (వాగ్భవ కూటము). దేవి ఈ త్రికోణము యొక్క నడుమ భాగమున నున్న దీపికతో భేదము లేనిదై యున్నది.

దేవి దక్ష ప్రజాపతి కొమార్తెయైన సతీదేవియే అయినందున దాక్షాయణియని పిలువబడుచున్నది. తండ్రిచేత అవమానింపబడి ఆ అవమానము భరించజాలక ఆత్మాహుతియై అతడు చేయుచున్న యజ్ఞము నాశనమగుటకు కారణమైనది. దేవి, రాక్షస ప్రవృత్తియెక్కడ యే విధముగా ప్రబలినా దానిని తుదముట్టించుచుండును. కావున భండాసురుడు మొదలగు దుష్టరాక్షసులను సంహరించినది. దేవి స్థూలరూపమును గుర్తుచేయుచున్నాడు. ఆమె కన్నులు లేడికన్నుల వలె చంచలితములై ఆకర్ణాంతము వ్యాపించియున్నవి. ఆ సోగకన్నుల సోయగముతో దేవి చూడముచ్చటగా ఉన్నది. అంత అందమైన కన్నుల కడగంటి చూపుతోనే తన నిజభక్తుల ననుగ్రహించుచున్నది. ఆమె ముఖము సొగసైన చిఱునగవుతో శోభాయమానముగానున్నది. ఆ మందస్మిత వదనారవిందము పాపాగ్నిచే తాపమునొందు భక్తులకు శరచ్చంద్ర చంద్రికలవలె తాపోపశమనమును గావించుచుండును. దేవికిని గురువునకును భేదము లేదని చెప్పుచున్నాడు. గురు శబ్దములో గుకారము బ్రహ్మస్వరూపము రుకారము జ్ఞాన స్వరూపమును అయియున్నవి. ఈరెంటి సమ్మేళనము గురుశబ్దమైనది. దేవి బ్రహ్మజ్ఞాన స్వరూపియే అయినందున గురుమూర్తియే అగుచున్నది. దేవి సమస్త సద్గుణములకును నిధివంటిది. ఆమెకు అన్నియు సద్గుణములే గలవు. తన భక్తులు గూడ సద్గుణవంతులే కాగోరుచున్నది. దేవి గోజాతికి తల్లియైన కామధేనువు స్వరూపియై కోరిన కోరికలను దీర్చు చల్లని తల్లియై యున్నది. కుమారస్వామికి తల్లియై వీరమాతగా ప్రస్తుతింపబడుచున్నది. అతడు దేవతల సేనకు సర్వసైన్యాధిపతి. సకల విద్యా పారంగతుడు. సకలకళాకోవిదుడు. పన్నెండుమంది శ్రీ విద్యోపాసకులలో ఒకడు. అతడే శ్రీసుబ్రహ్మణ్యా పరావతార లలితానంద సరస్వతీ స్వామివారు. దేవి బ్రహ్మాది దేవతలకును ఈశ్వరి. దండనీతి అనగా ఇచట అర్థశాస్త్రము అని భావము. దానియందు అభిమానియై నిలచి యుండునది గనుకనే ధనాధ్యక్షా యని కూడ స్తుతించియున్నాడు. ఆర్థిక వ్యవహారములు పరిశీలించుటయందామె దిట్ట. మీదు మిక్కలి కోశాధికారి. ఆమె అనుమతి లేనిదే యెవరికి చిల్లిగవ్వయైనను దొరకదు. హృదయ కుహరమునందుండెడి సూక్ష్మాకాశమునకు దహరాకాశ యందురు. అది పరిమాణములో మిగుల సూక్ష్మమైనది. దేవి ఆ దహరాకాశ స్వరూపురాలు. కామేశ్వరాదిగ చిత్రాయను నామె వఱకు గల పదునైదు నిత్యాదేవతల స్వరూపములో పాడ్యమినుండి పౌర్ణమి వఱకు తిథిభేదమును బట్టి ఒక్కొక్క తిథియందు ఒక్కొక్కరీతిని పూజింపబడుచున్నది. దేవిని

సార్ధకమైనది. పర్వత రాజ పుత్రిక యైనందున పార్వతి గాను, కన్యాకుబ్జమునందుగల పీఠాధిష్ఠాన దేవతయగు గౌరిగాను ప్రసిద్ధి జెందియున్నది. గంధర్వులు తమగానకళా కౌశల్యముతో దేవిని సేవించుచుందురు. సర్వప్రపంచములను సు-వర్ణసంయుతములైన సప్తకోటి మహామంత్రములను తన గర్భమునందు ధరించి యున్నది. అనగా వీటికన్నింటికి దేవియే మూలమని భావము. అవరులనగా మ్లేచ్ఛులు.దేవి దుష్ట శక్తులనంతమొందించి శిష్ట జనులను రక్షించు చున్నది. వాక్కులకధీశ్వరి యైన జ్ఞాన సరస్వతీ దేవిగా తననాశ్రయించిన వారికి అద్వైత సిద్ధిని కలగజేయుచున్నది. ఆది అనన్యమైన భక్తితో నిరంతరము అభ్యాసము చేయుచు చిరకాలముగా చేసిన ధ్యానము ద్వారా దేవియనుగ్రహము వలనే గలుగును. కావున దేవిని ధ్యాన గమ్యా యని అనుచున్నాడు. దేవి సాయుజ్యము ధ్యానము ద్వారానే లభించునని వక్కాణించు చున్నాడు. అట్టి ధ్యాన నిష్ఠాపరులకు జ్ఞాన భిక్షను పెట్టి వారిని శాశ్వత ముక్తులుగా జేయుచున్నది. సర్వ వేదాంతముల చేత తెలియబడుచున్నజ్ఞానమే తన విగ్రహముగా స్వయంప్రకాశమై సర్వమును ప్రకాశింప జేయుచున్నది. సత్యము అనందము తన స్వరూపముగా గలిగియున్నది. సత్యమనగా నామరూపాత్మక ప్రపంచముకన్న వేరైన, నాశరహితమైన, ఒకానొక వస్తువున్నదని యేది శృతుల వలన చెప్పబడు చున్నదో అది. సృష్టికి ఆదిలోను, అంతమున, వర్తమాన కాలమున నిత్య సత్యమై యుండునది. దేవి ఆ సత్యపదార్థమైయున్నది. మానుషానందము, బ్రహ్మానందము మొదలగు వానికి మించినది సర్వానందము. అట్టి సర్వానందమే ఆమెరూపముగా గలిగి యున్నది. పన్నెండు మంది శ్రీవిద్యోపాసకులలో ఒకరైన లోపాముద్ర చేత పూజింపబడు చున్నదనుటలో దేవి యోగ్యతను చెప్పుచున్నాడు. లీలా మాత్రముగనే బ్రహ్మాండములను సృజించు చున్నది. దృశ్య పదార్థములకంటె విశిష్టమైన లక్షణములు గలిగి అవాంగ్మానసరూపముననున్నది. ఈ దృశ్యమానమైన జగత్తు యావత్తు పరమార్థమున పరబ్రహ్మ స్వరూపమే అయినందున తనకన్నా పరమైన వస్తువేదియును లేదు. దేవి సర్వజ్ఞ యైనందున ఆమెకు తెలియదగు విషయమేమియునులేదు. అదృశ్యా, దృశ్యరహితా, విజ్ఞాత్రి, వేద్య వర్జితాయను నీ నాలుగు నామములు దేవి విశ్వవ్యాపితత్వమును, సర్వజ్ఞత్వమును సూచించు చున్నవి.

ఇప్పుడు జీవాత్మ - పరమాత్మలకు ఐక్యాను సంధానమును చెప్పుచున్నాడు. యోగమనగా ఏకత్వభావన అది జీవబ్రహ్మైక్యమును కలిగించు జ్ఞానము. దేవి తన భక్తులకు అట్టి సుజ్ఞానమును కలిగించు చున్నది. 'యోగశ్చిత్తవృత్తి నిరోధకః' అను వాక్యమునననుసరించి చిత్త వృత్తి నిరోధరూపమగు సాధనము యోగము. దేవి అనుగ్రహము కొఱవడిన వేళ చిత్త వృత్తినిరోధమునకాస్కారములేదు. చిత్తశుద్ధి, చిత్తవృత్తి నిరోధము లేనిచో యోగమే లేదు. యోగాభ్యాసము మొదలే లేదు. కావున యోగము నిచ్చుటకు గాని, దానిననుష్ఠించుటకు, దాని వలన గలుగు దివ్యానుభూతి ననుగ్రహించుటకు వలసిన సత్తా కలిన దగుట చేత దేవిని యోగ్యాయని ప్రశంసించు చున్నాడు. కృతయుగ, త్రేతాయుగము

రెండవదాని భావము. వాస్తవమునకు ఈ రెండూ కాని విలక్షణమైన స్వరూపము స్వభావములు గలిగి దేవి అనిర్వచనీయమైనది. అనగా దేవి ఇట్టిదని నిర్వచించుటకు శక్యము కానిది. వేదములు, వేదాంగములు దేవిని గుఱించి వర్ణించినది లేక నిర్వచించినది స్వల్పాంశమే. దేవి సుఖముగా ఆరాధింపదగినది. అనన్యమైన భక్తిభావముతో పత్రం, పుష్పం, ఫలం, తోయం అను ఈ నాలిగింటిలో దేనితోనయినా అర్చించి ఆరాధించుకొనిన దేవి మిగుల సంతోషించుచున్నది. భక్తి ప్రధానముగాని ఆర్భాటము కాదు. సుఖం అను పదము బ్రహ్మ పదార్థమునకును వర్తించును. చూ॥ 'యద్వై భూమా తత్సుఖం' అని శృతి. భూమా యనగా పరబ్రహ్మమని యిదివఱకు వచ్చియే యున్నది. 'సుఖం భూమాస్వరూపము' కావున పరబ్రహ్మస్వరూపురాలైన దేవిని సుఖ స్వరూపురాలుగా గ్రహించవలయును. ఆమెను ఆ రూపములో ఆరాధించదగునని సూచించుచున్నాడు. శుభం, శోభనం, సుఖం ఇత్యాదులైన వన్నియు పరబ్రహ్మ స్వరూపమును సూచించు పర్యాయ పదములు. దేవి తన భక్తులకు శుభములనొసగునట్టి ముక్తి కాంత. దేవినారాధించుటచేతనే జనులకు చతుర్విధ పురుషార్థములు కలుగుచున్నవి. దేవీవుపాసకులు పన్నెండుమందిలోను కుబేరుడొకడు. అతడే రాజరాజు అతనికిని ఈశ్వరి అనగా ప్రభ్వి గనుక దేవిని రాజరాజేశ్వరి యనుచున్నాడు. తన భక్తులకు వైకుంఠము కైలాసము మున్నగు రాజ్యములననుగ్రహించుచున్నది. దేవి ఆ రాజ్యములయందు ప్రీతి గలిగి వాటికి అధీశ్వరి అయియున్నది. తన ఆశ్రితులయందు విశేషమైన అనుగ్రహమును చూపుచు వారిని రాజ్యపీఠములయందు అధివసింపజేయుచున్నది. దేవి రాజ్యలక్ష్మీస్వరూపురాలు. చండుడు, ముండడు మొన్నగు రాక్షసులను సంహరించుటకై చతురంగబలములను కలిగియున్నది. తన భక్తులకు కైలాసాది రాజ్యములనను గ్రహించుచున్నది. దేవి సత్య సంధ. అనగా సత్యమే ప్రతిజ్ఞగా గలది. దేవి సత్యస్వరూపురాలు. దేవికి సాగరములే మొలనూలుగా ఉన్నవనుచున్నందున భూరూపమును సూచించుచున్నది. భూమి చుట్టు సముద్రములు మొలనూలు వలెనే యుండును. కావున దేవి భూ స్వరూపురాలు. శివుని అష్టమూర్తి స్వరూపములలో యజ్ఞమునకు దీక్ష వహించువాడు కూడ గలడు. కావున దేవిని అష్టమూర్తి స్వరూపమైన దీక్షితగా పేర్కొనుచున్నాడు. ముందునామములో భూస్వరూపమును సూచించి ఇప్పుడు దీక్షితాయనుచున్నాడు. ఈ రెండు పదములు అష్టమూర్తినే తెలియపరచుచున్నవి. దేవి రాక్షస జనమునుశమింపజేయుచున్నది. సర్వలోకవశంకరీ యనుటచేత దేవి విభూతిని / అంతర్యామిత్వాన్ని సూచించుచున్నది. దేవి తన భక్తులకు సకల శుభములనిచ్చుచున్నది. సవిత్రుడనగా సూర్యుడని యర్థము. పరాశక్తి సూర్యమండలమునందుండుటచే సావిత్రియనబడుచున్నది. దేవి గాయిత్రీ స్వరూపురాలు. సత్, చిత్, ఆనందము ఈ మూడు తన స్వరూపములుగా గలిగియున్నందున దేవిని సచ్చిదానంద రూపిణి యనుచున్నాడు. దేవి ఒక దేశమునకు గాని ఒక కాలమునకు గాని పరిమితి అయియుండలేదు. ఈ కాలమునందున్నది ఆ కాలమునందున లేదు అని చెప్పుటకు వీలు లేదు.

భావము. 'ఈ' నామము కామకళాబీజము. ఇది సంయద్బిందువును సూచించు చుండుట చేత సర్వోత్తమమైనది మరియు ధృవకళ, షోడశీకలయూనైన శ్రీ లలితాపరాభట్టారికను తెలుపుచున్నది. ఇచట దేవిని విష్ణుసహోదరిగా పరమ శివపట్టమహిషిగా గ్రహించ వలసి యుండును, 'ఈ' నామము నుపాసించినచో మోక్షము కలుగునని శృతులు చెప్పుచున్నవి. గురుమండలమనగా గురు సమూహము. పరమశివుని మొదలుకొని తన గురువు వఱకు గల గురు పరంపర. దేవి ఆ గురుపరంపరా స్వరుపురాలగుటచే గురు మండల రూపిణి యనిస్తుతించుచున్నాడు. కులం అనగా యిచట ఇంద్రియ సమూహమని గ్రహించ వలయును. దేవిని కులోత్తీర్ణాయను చుండుట చేత ఇంద్రియ సమూహమునతిక్రమించినదని ఇంద్రియములకు గోచరించని అవాంఙ్మానసయని గ్రహించ వలయును. భగుడనగా సూర్యుడు. దేవి సూర్యమండలమున ఉండునది కావున అచట ఆరాధింప బడునది. భగవంతుని యొక్క శక్తికి బ్రహ్మ మాయాశక్తి (క్రియాశక్తి) యని వ్యవహారము. అది త్రిగుణాత్మకమైన మూలప్రకృతి. దీని పని బ్రహ్మాండములను సృజించుట. దేవి అట్టి మాయాశక్తి స్వరూపురాలు. దేవి పూజాంగములుగా మధువును కలిగి యున్నది. శ్రీ, పంచదశీ విద్యల వలెనే మధు విద్య అనునది గూడ తన నిజ స్వరూపమునుతెలుసుకొనుటకు సాధనముగా నున్నది. ఇచ్చట దేవిని మధుమత్యై యనుటచేత శ్రీదేవి అట్టి మధువిద్యా స్వరూపిణియనుచున్నాడు. దేవిని మహ్యైయనుచున్నాడు. మహ్యైయనగా భూమి రూపమున ఉండునది అని అర్థము. ఇంతకు ముందు దేవిని 'ఈ' యను కామకలాస్వరూపిణియని అది మిక్కిలి రహస్యమైనదిగా చెప్పి ఇప్పుడు భూమితో పోల్చుట చేత దేవి యెంతటి రహస్య స్వరూపురాలయినను భూమివలనే ప్రకటమగు స్వభావము కూడగలదని చెప్పుచున్నాడు. దేవి ప్రమధగణములకు అధిపతియైన వినాయకునికి తల్లియైనందున గణాంబా అని స్తుతించబడుచున్నది. దేవి గుహ్యకులను వారిచేత ఆరాధించబడుచున్నది. వీరు దేవగణములలో ఒక తెగకు చెందినవారు. దేవి కుసుమకోమల సదృశమైన అవయవములను గలిగియుండుటచే కోమలాంగీ యనుచున్నాడు. గురుడనగా యిచట శివుడని యర్థము. శివుని ప్రియుడుగా గలిగినదియగటచే గురుప్రియ. తాను స్వతంత్రముగా లోకయాత్రను నియంత్రించగలదు. దేవి వామకేశ్వరాది అన్ని మంత్రములకును యీశ్వరియైనందువలన సర్వ తంత్రేశీయనుచున్నాడు. దక్షిణాభిముఖ మూర్తిని దక్షిణామూర్తియందురు. శివుడు ఈ దక్షిణామూర్తిరూపమున బ్రహ్మ, విష్ణువులకును గురూపదేశము చేసినవాడు. శ్రీదేవి అతని భార్య గనుక దక్షిణామూర్తి రూపిణి యనుచున్నాడు. ఈ రూపేణా దేవి జ్ఞానదాత్రియై యున్నది. సనకసనందనాదులచేత లెస్సగా ఆరాధింపబడునది దేవి. దేవి శివ సంబంధియైన జ్ఞానమును తన భక్తులకు కలుగజేయుచున్నది. సచ్చిదానందాత్మకమైన బృహత్కళ తనయందు గలిగియున్నది. పరబ్రహ్మము యొక్క స్వల్పాంశమును ఆనందకలయందురు. దేవి అట్టి ఆనంద కలికను గలిగియున్నది. ప్రేమ అనగా స్నేహము, భక్తియని అర్థము. దేవి ఈ రెండు రూపములుగాను

తద్వారా ఆమె అనుగ్రహమునకు పాత్రులగుచున్నారు. దేవి తన భక్తుల సంసారబంధములను త్రెంచి ఆ సంసారమను దావాగ్నికి సుధావృష్టి యగుచున్నదనుచున్నాడు. తన ఆశ్రితుల పాపములనెడి అరణ్యమునకు దావానలము వంటిది అనగా వారి పాపములను పారద్రోలి వారికి శాశ్వతమైన మోక్షమును అనుగ్రహించునని భావము. దౌర్భాగ్యమనగా దురదృష్టము. అట్టి దురదృష్టములను తొలగించుటలో దూదికి పెనుగాలివలె చేయును. అనగా తన భక్తుల దౌర్భాగ్య స్థితిని సునాయాసముగా నెట్టి వేయునని అర్థము. ముదిమి యనెడి చీకటి రోజులకు సూర్య తేజస్సగుచున్నది. అనగా ముదిమిన కలుగు మానసిక, శారీరక వెతలనుపశమింపజేసి తన భక్తులకు స్వస్థత, ప్రశాంతతలను కలుగజేయుచున్నదని యెరుంగవలయును. తన ఆశ్రితుల భాగ్యాంబుధికి చంద్రుని వంటిది. దేవి కరుణా కటాక్షములు కల వారి భాగ్యము అపరిమితముగా పెరిగిపోవునని భావము. భక్తుల మనస్సనెడి మయూరములకు మలయమారుతము. దేవిని ధ్యానించి ఆమె సాక్షాత్కారమును బొందిన భక్తుల ఆనందాతిరేకమున గంతులు వేయుదురని భావము. దేవి సమస్తరోగోపశమనము జేయుటలో పర్వతములకు వజ్రాయుధము వలె పనిచేయును. దేవియే వైద్యుని రూపమున రోగికి స్వస్థత చేకూర్చునదని యర్థము. దేవి అపమృత్యువు, అకాలమృత్యువులను తప్పించుటలో కట్టెలను నరకుటకు గండ్రగొడ్డలివలె పనిచేయునది. అనగా తన నాశ్రయించిన భక్తులను అన్ని అపమృత్యువుల నుండి తప్పించుచుండునని తెలియవలెను.

దేవి ఈశత్వ తత్వమును చెప్పుచున్నాడు. దేవిని మహేశ్వర్యై యనుటచేత ఆమె ఈశ్వరుని భార్యయని ధ్వనించుచున్నది. మహేశశబ్దమునకు అపరిచ్ఛేద్యుడు, సర్వజ్ఞత్వాది శక్తులు నియంతృత్వాది ధర్మములు గలవాడని యర్థము. ఈ లక్షణములన్నియు దేవియందు పరిపూర్ణముగా ఉన్నందున మహేశ్వరియనుచున్నాడు. దేవి ఉజ్జయని యందున్న మహాకాలుని పత్ని మహాకాళి. ఇది అష్టాదశ శక్తి పీఠములలో ఒకటిగా ప్రసిద్ధిజెంది యున్నది. శ్రీదేవి ఆ మహాకాళి రూపమున ఉజ్జయనీ పీఠస్తురాలైనది. మహాకాళికి ప్రళయకాలమునందు సర్వజగత్తులు లయమగుటచే ఆహారమగును. మహాగ్రాస అనగా చాలా ఆహారముగలదని యర్థము. చరాచర ప్రపంచమంతయు ప్రళయకాలమున దేవి వలననే నశింపు చెందుచున్నది. పార్వతీదేవి తన బాల్యమున ఆహారమేమీ ముట్టకుండ కనీసము పర్ణములు కూడ లేకుండ కఠినమైన తపమాచరించినది. మునులామెస్థితిని గమనించి ఆమెను అపర్ణాయని పిలచిరి. అపర్ణ అనగా ఋణములు లేదని కూడ అర్థము గలదు. దేవి తన భక్తులకు పుణ్యాపుణ్య ఫలములనిచ్చి వారి ఋణమును తీర్చుకొనుచుండుటచేతను గూడ అపర్ణగా ప్రసిద్ధి చెందినది. దేవి భక్తులు కానివారిని, దుష్టులను సహించదు. వారియందు కోపమును వహించును. అందువలన చండికాయనబడుచున్నది. చండుడు, ముండుడు మొదలైన దుష్టరాక్షసులను చండికారూపమెత్తియే సంహరించినది. క్షరములనగా నశించునవి. ఆకాశాది సర్వభూతములు.

విరాడ్రూపమునంది యున్నది. దేవి పాపరహితురాలైయున్నందున విరజయనిస్తుతించబడుచున్నది. ఈ విరజాయనునది ఒక నది విశేషము. రామదాసుగా ప్రసిద్ధి పొందిన కంచర్ల గోపన్న తన దాశరథీ శతకములో విరజానదిని ప్రస్తావించి అదియే ఇక్కడ గోదావరిగా పుట్టినదని వేనోళ్ళపొగడినాడు. చూ: 'శ్రీరమసీతగాగ నిజసేవకబృందము వీరవైష్ణవాచార జనంబుగాగ..............విరజానది గౌతమిగా వసించు చేతనోద్ధారకుడైన విష్ణుడవు' దాశరథీ.....అని పావనమైన గోదావరిని తెలియని వారెవరుందురు? విరజయనగా తొలగిన పాపములు గలదియని అర్థము. కనుక దేవిని పావనాకృతయే యని స్తుతించుట సర్వతీర్థములయందు మునిగినదానికన్న శ్రేష్ఠమనిసూచించుటయే యగును. దేవిని విశ్వతోముఖియనుట చేత దేవి విశ్వవ్యాపితమును చెప్పు చున్నాడు. దేవి అంతర్ముఖురాలు. ఆమె అంతరాత్మయందే చూడదగినది. చక్షురింద్రియములకు గోచరముగాదు. దేవిని పరాకాశా, ప్రాణదా, ప్రాణరూపిణి అని స్తుతించుట ఆమె పరబ్రహ్మమని వక్కాణించి చెప్పుటయే ప్రాణశబ్దమునకు పరబ్రహ్మమని అర్థము గలదు కావున ప్రాణరూపమున నుండి జీవులకు ప్రాణమును పోయునది శ్రీలలితాంబికయే గాని మరెవరుగాదు. శ్రీ పురమునకు 22-23 ప్రాకారములనడుమ మార్తాండభైరవుడు గలడు. దేవి అతని చేత ఆరాధించబడుచున్నది. దేవి తన రాజ్యభారమునంతయు మంత్రిణియైన శ్యామలాంబపైనిడి, తను భండాసురవధకు వ్యూహమును రూపొందించు కొనుచున్నది. శ్రీ చక్రములో సర్వాశాపరి పూరకమను చక్రమునకు అధీశ్వరి త్రిపురేశీ. ఈ నామము చెప్పుట వలన శ్రీ దేవి, త్రిపురేశీలకభేదమును చెప్పుటయేయగును. భండాసురాది రాక్షసులను జయించుటకు వలసిన సేనను శ్రీదేవి కలిగి యున్నది. నిస్త్రైగుణ్యా అనగా త్రిగుణాతీతయని అర్థము. దేవి నిరుపాధి గనుక నిస్త్రైగుణ్యా కూడా అగును. ఇవి మాయా ప్రకృతి విశేషములు. మాయ దేవికి లోబడియే యుండును కాన దేవి మాయకు అతీతురాలని చెప్పుచున్నాడు. పర అనగా ఇతరము (జగత్తు) అపరమనగా ఆత్మ. దేవి ఈరెండు రూపములనుండునది. సత్యము, జ్ఞానము ఆనందము అనునీమూడునుకలిసిన యేక రూపమే దేవి అయియున్నది. ఎక్కువ,తక్కువలులేని రసము ఆనందానుభవము గలవారు సమరసులన బడుదురు. శివుడు, శక్తి సమాయోగమే సామరస్యము. దేవి అట్టి సామరస్యమునందు అనురక్తి కలిగి యుండునది. కపర్దములనగా గవ్వలు. వాటి చేత అలంకరించబడునది కపర్దిని. మైలారవతారుడగు శివుని పత్నియగు మహాలసా దేవికి గవ్వల దండలు అలంకరింతురు. దేవి అట్టి కపర్దినీ స్వరూపిణి. దేవిని కళామాలాయనుటవలన చతుష్షష్టికళలే తన రూపముగా గలదని చెప్పు చున్నాడు. దేవి తన భక్తుల ఈప్సితార్థములను నెరవేర్చు చుండును. దేవిని కామరూపిణియనుచున్నాడు. కామశబ్దము ఈశ్వరపరముగా దేవి శివుడే తన రూపముగా గలదని అర్థము. తనయిష్టము వచ్చిన రూపమునందగలదని వాక్యార్థము. దేవి కళలకు నిధి. కావ్యములును చతుష్షష్టి కళల లోనివే అయినందున దేవి అట్టి కావ్యకళారూపమున నుండును. దేవిని ఉపాసించు వారికి కావ్యరచనా సామర్థ్యము వచ్చును. దేవికి శృంగారాదిరసములు

చున్నాడు. బ్రహ్మజ్ఞానసంపన్నులచేత పూజింపబడుచున్నది. సర్వప్రపంచమును ఉత్పన్నమొనర్చునది యగుట చేత ప్రసవిత్రి యనుచున్నాడు. దేవి తీవ్రమైన కోపస్వభావము గూడ గలది. అందుచేతనే ఆమె భయమున పంచభూతములు, సూర్య చంద్రులు తమ తమ గతులు తప్పకుండ తమ విధులను నిర్వర్తించుచున్నారు. వేదములందు విధి, నిషేధములున్నవి. అవి భగవానుని ఇచ్ఛాధీనములు. ఆయిచ్ఛకే ఆజ్ఞయనిపేరు. దేవి అట్టి భగవదిచ్ఛా రూపముననున్నందున ఆజ్ఞా అనుచున్నాడు. ఆమె ఆజ్ఞను దాటువారెవరునూ లేరు. సకల జగత్తునకును ఈమెయే ఆధారము కావున ప్రతిష్ఠయనుచున్నాడు. విశ్వము ఈమెయందే నిలచి యుండును కనుక దానికి దేవి సుప్రతిష్ఠ. శ్రీపురమునందు మొదటిప్రాకారములో నుండు దేవికి ప్రకటాకృతియనిపేరు. ప్రకటమగు స్పష్టమైన ఆకారము గలిగినది దేవి. సర్వకాల సర్వావస్థల యందున అందరిచేత సంభావించబడు ఆకారముగలది దేవి. శక్తితోడ్పాటే లేనిచో పంచబ్రహ్మలు కూడ ఏమియూ చేయజాలనందున వారు ప్రేతలనబడుచున్నారు. ప్రకటయోగినియైన దేవి వలననే వారు తమ తమ కృత్యములను నిర్వర్తించగలుగుచున్నారు. కావున యెవరైనను ఏ పనిచేయుటకైన శక్తితోడ్పాటు ఉండవలసినదే. అటుల అన్ని సందర్భములలోను లోక ప్రవృత్తికి శక్తి అనుభవగోచరమగుచుండును. అచేతనములైన గృహములు, భవనాదులు నిలచుటకు గూడ శక్తితోడ్పాటు అవసరమగుటను మనము చూచుచునే ఉండుదుము. శక్తిలేని నాడు అవి కూలిపోవుట కూడా చూచుచున్నాము. కనుక శక్తి లేని వస్తువుగాని, శక్తిరూపముగాని వస్తువుగాని లోకమునందెచ్చోటను ఉండదు. ఆ విధముగా దేవి శక్తి రూపమున అన్నింటా ఉండుటచే ప్రకటాకృతయే అనుచున్నాడు. ప్రాణశబ్దము పరబ్రహ్మపరమైనది. కాని యిచట దేవిని ఇంద్రియముల పరంగావాడి ప్రాణేంద్రియముల కధిష్ఠాత్రియై వానిలోనుండునదియని చెప్పుచున్నాడు. దేవి పరబ్రహ్మస్వరూపురాలగుటచే జీవులకు ప్రాణముపోసి వాటిని ఉద్దీవింపజేయుచున్నదని తరువాత ప్రాణదాత్రియనుచున్నాడు. దేవి పంచాశత్పీఠములు అన ఏబది ఒకటి అన్వయించుకొనవలయును. దేవి ఆ పీఠముల స్వరూపురాలు. దేవికి యే విధి, నిషేధములు లేనందున స్వతంత్రమైనది. శృంఖలములనగా సంకెళ్లు లేక బంధములు. దేవి స్వతంత్రగావున ఆమెకు ఏ సంకెళ్ళు ఉండవు. విశృంఖల అనగా తొలగిన సంకెళ్ళు గలదిఅని అర్థము. ఆమెకు బంధమే లేనప్పుడు వాటిని త్రెంచుకొను ప్రశ్న ఉదయించదు. పవిత్ర మనస్కులై ఏకాంతమున ఆత్మతత్వమును అన్వేషించువారు వివక్తులనబడుదురు. అట్టి వివక్తులుండు పవిత్రమైన ప్రదేశమున ఉండునది దేవి. వీరులైన వినాయకుడు, కుమారస్వాములకు తల్లిగాన వీరమాతయనుచున్నాడు. ఆకాశాది పంచభూతములను, సర్వసృష్టులను చేయునది. ముకుందాయనగా మోక్షమునొసంగువాడు విష్ణువని అర్థము. దేవి విష్ణువునకు సహోదరియైనందున ముకుంద శబ్దమును అనుసరించి దేవి కూడ ముకుందా అయినది. ముకుంద శబ్దమే మోక్షమునిచ్చునది అని సూచించుచున్నది. దేవి మోక్షమునొసంగునది కావున

ఆమెకు ఏ పుట్టుకయును లేదు. పుట్టుకయే లేనప్పుడు అవతారము చాలించుట అను ప్రశ్నయే రాదు. దేవి అనంతమైనది. దేవి ముగ్ధ మోహన రూపము గలది. అతిలోక సౌందర్యవతి. ఆమె తన భక్తులను శీఘ్రముగా అనుగ్రహించునది. లోచూపు అనగా తమ ఆత్మవైపు చూపుగలవారు అంతర్ముఖులు. దేవి అట్టివారిచేత మాత్రమే ఆరాధింపబడుచున్నది. బాహ్య విషయములవైపు దృష్టి మరల్చువారు బహిర్ముఖులు. అట్టివారికి దేవి తేలికగా దొరకని వస్తువు. దేవి ఋగ్యజుస్సామ వేదములను మూడు వేదముల రూపమున ఉండునది. ధర్మార్థకామములనెడు పురుషార్థ త్రయము నివాసముగా గలది. ఈవిధముగా మూడు శబ్దములు గల అన్ని రూపములయందును దేవి ఉండును. ఉదా : బ్రహ్మ, విష్ణు మహేశ్వరులు, సూర్య, చంద్ర, అగ్నులు, వాత, పిత్త, శ్లేష్మములు ఇత్యాదులు త్రిసంఖ్య గలవి. అంతర్ధశారములో నున్న పది దళములుగల చక్రము నందభిమానియై అందధిష్టించి యున్న దేవికి త్రిపురమాలిని అనిపేరు. దేవి ఆత్రిపురమాలినితో అభేద్యురాలు. దేవికి ఆమయములు అనగా ఏరోగము నొప్పులు లేవు. అందువలన నిరామయ అని అనబడుచున్నది. విశ్వము ఆమె యందు నిలచియున్నది. జగత్తు అంతటికి ఆమెయేఆధారము కనుక ఆమెకు ఏఆధారమును, ఆలంబనమును అవసరము లేదు. అందువలన నిరాలంబా అని అనుచున్నాడు. సృష్ట్యాదిని ఒకానొక వస్తువు ఉన్నది. అది నిర్గుణబ్రహ్మపదార్థము. దానికి స్త్రీ , పుంస భేదములు లేవు. సృష్టి కార్యక్రమము కొఱకు అది రెండుగా అనగా స్త్రీ పురుషులుగా విభాగమైనది. <u>వారిద్దరి సమరస భావము స్వాత్మారామము.</u> దేవి తద్రూపిణి యై యున్నది. సహస్రార కమల కర్ణిక నుండి దేవి కుండలిని ద్వారా సుధా సృతిని కురిపించుచున్నది. తన భక్తులను సంసారము నుండి రక్షించుటలో గొప్ప నేర్పును ప్రదర్శించును. దేవికి యజ్ఞములనిన మిగులప్రీతి. యజ్ఞమునాచరించి దానికి కర్తగా కూడ ఉండును. యజ్ఞముచేయువాడు యజమాని. దేవి ఆ యజమానస్వరూపురాలనుచున్నాడు. సర్వధర్మములకును దేవియే నియంత్రి. వేదములకు విరుద్ధములు కాని వన్నియు ధర్మములు. ధనాధ్యక్షుడు కుబేరుడు. అతడు దేవి ఉపాసకులైన పన్నెండు మందిలోను ఒకడు. దేవతయగు లలితాంబికకు ఉపాసకుడగు కుబేరునకును భేదము లేనందున దేవి ధనాధ్యక్షురాలనబడుచున్నది. తన ఆశ్రితులకు ధనధాన్యములను వర్ధిల్లజేయుచున్నది. బ్రహ్మజ్ఞానము సంపాదించినవారు విప్రులు. దేవికి అటువంటి విప్రులనని మిక్కిలి ఇష్టము. దేవి బ్రహ్మజ్ఞాన స్వరూపిగావున తానును బ్రహ్మజ్ఞానమును బొందిన విప్రులరూపమున ఉండునది. విశ్వములనగా బ్రహ్మాండములు. అవి పరిభ్రమించునట్లు చేయునది అనగా సమస్త విశ్వముయొక్క సృష్టి, స్థితి, లయలను చేయునదియని భావము. విశ్వములు తనకు గ్రాసముగా గలది కావున విశ్వగ్రాసాయనుచున్నాడు. ప్రళయకాలమందు అన్ని సృష్టులు నశించి దేవికి నైవేద్యమగును. విద్రుమములనగా పగడములు. దేవి శరీరకాంతి వాటి ద్యుతిని బోలియుండును. దేవి విష్ణుమూర్తికి సోదరి కావున వైష్ణవి అనబడుచున్నది. విష్ణువుతో అభిన్నమైది కావున విష్ణురూపిణి అనుచున్నాడు.

దేవి సదా శివ కుటుంబమునకు పెద్ద. సూర్య గోళమునకు కుడివైపున అనగా ఉత్తర భాగమునందుండునది సవ్యమార్గము. ఎడమవైపున అనగా దక్షిణభాగమునందు ఉండునది అపసవ్యము. ఈలోకములో సంసారమునకు పునరావృత్తి జెందని ఉత్తములు ఈ లోకమును విడచిన తదుపరి పోవు మార్గము సవ్యము. ఈ లోకములోనికి పునరావృత్తి చెంది మరల లోకములనారంభించువారు పోవుమార్గము అపసవ్యము. దేవి ఈ రెండు మార్గములయందును ఉండునది. ఈ రెండు మార్గముల నుండి పోవుటకు అర్హతలేని పాపిష్టులు ఆపదలనొందుదురు. అట్టిజీవులకు కలిగెడి అన్ని ఆపదలను దేవి నివారించునది. ఇది దేవియొక్క జీవకారుణ్యమును తెలుపుచున్నది. దేవి యేమార్గమును లేక అయోమయములోపడి ఆపదలను బొందువారిని కూడ రక్షించుచున్నదని భావము. దుఃఖముల వలన చాంచల్యము కలగును. దేవి ద్వంద్వాతీతగావున ఆమె సుఖదుఃఖాలు మొదలైన వాటిక న్నింటికి అతీతురాలు. ఆమెకు చాంచల్యము లేదు. సుస్థిరముగా హాయిగా ఉండునది. తన సహజ స్వభావముచేత మధురమైనది. అందువలన అందరిచేత కోరబడుచున్నది. దేవిని ధీరులు, పండితులు, జ్ఞానులు అందరూ అర్చించుచున్నారు. దేవి ఆత్మజ్ఞానముచేతనే మెప్పు పొందును. తను మెచ్చినవారికి అభేదజ్ఞానమును కలిగించి వారిని తరించుచున్నది. దేవికి చైతన్య కుసుమములనిన మిగుల ప్రీతి జెందునది. దేవి సదా స్వయం ప్రకాశమానమై మిట్టమధ్యాహ్నమునందున్న సూర్యకాంతివలె యెఱ్ఱనికాంతి కలిగియున్నది. దేవి సమయ మార్గమున, కౌళమార్గమున రెండు మార్గముల పూజలచేతను ఆరాధించబడుచున్నది. దేవి మందస్మిత వదనారవిందముతో ప్రసన్నముగా ఉండును. దైవజ్ఞులు చెప్పు ధర్మములతో గూడిన కాలస్వరూపిణి దేవి. వెలయింతని చెప్పలేని మోక్షపదవిననుగ్రహించునది దేవిని స్తుతించుటచేత జ్ఞానము కలుగును. దేవి వైదికస్తుతుల యందు ప్రీతిని కలిగియున్నది ఉపనిషత్తులలో విశేషముగా స్తుతించబడియున్నది. దేవి ఆత్మాభిమానము గలదై స్వతంత్ర ప్రవృత్తి గల మనస్సుతో ఉండునది. మహాన్ అనగా అపరి చ్ఛేదుడు. ఈశః నియంతృత్వధరము గలవాడు ఈశ్వరుడు. అతని భార్య గనుక మహేశీ అనుచున్నాడు. దివ్య మంగళ విగ్రహమును గలిగియున్నది. 'సర్వజీవులకును తల్లి. ఈ జగత్తును సృజించి దానిని ధరించి భరించుచున్నది. కాశీలోని అన్నపూర్ణ విశాలాక్షియే. ఆమె విరాగిణి. అయినా మిగుల గడుసరి దేవి. సృష్టి, స్థితి, లయములందు నేర్పు గలిగినది. దేవి నిర్గుణ బ్రహ్మస్వరూపమే అయియున్నది. విరాడ్రూపిణియగు దేవికి ఆకాశమే కేశములుగా ఉన్నది. విమానములలో సంచరించువారు దేవతలు. ఆదేవతలతో అభేదముగలది. వజ్రాయుధమును ధరించు ఇంద్రుని భార్య శచీదేవితో అభేదము గలది. వామకేశ్వరి తంత్రములు ప్రతిపాదించుచున్నందున వామకేశ్వరియనబడుచున్నది. పంచయజ్ఞములు దేవికి ప్రియమైనవి. అవి ధర్మ పూర్ణమాస, పశుసోమములని స్మృతులందు చెప్పబడుచున్నవి. బ్రహ్మ, విష్ణు, రుద్ర ఈశ్వరులు నలుగురు కోళ్ళుగా సదాశివుడు శయ్యగా గల

చదివిన, వినిన పుణ్యము లభించును. దేవి తన నాశ్రయించిన వారికోరికలను తీర్చుటలో మిక్కలి ఔదార్యమును చూపును. బ్రహ్మాత్మైకానుసంధానమును పునఃపునరావృతము చేయుటను అభ్యాసాతిశయము అందురు. అట్టి అభ్యాసమున దేవి ప్రత్యక్షమగును. వర్ణ, పద, మంత్ర, భువన తత్వ, కళలు అనునీ ఆరును షడాధ్వలనబడును. ఇవి దేవిని ఉపాసించుటకు వలసిన యోగ్యతను కలుగజేయును. దేవి ఈ ఆరు అధ్వలను అతిక్రమించినందున షడధ్వాతీత అనుచున్నాడు. ఏ ఉపాధియు లేకుండగనే కలిగెడు కరుణకు అవ్యాజ కరుణ అందురు. దేవి అట్టి అవ్యాజకరుణామూర్తియని స్తుతించుచున్నాడు. అజ్ఞానాంధకారమునకు దీపికలాంటిదనుచున్నాడు. భక్తులకు అభేదజ్ఞానమును కలిగించి వారికి అద్వైతసిద్ధిని కలుగజేయుచున్నదని భావము. పిల్లలనుండి పెద్దల వఱకు, పండితులనుండి పామరులవఱకు అందరికి ఈమె తెలియును. శక్తితోడ్పాటు లేనిదే ఎవడును యేపని చేయజాలడు. ఏదయిన పని చేయజాలక ఆ పనికి తాను అశక్తుడను అనుకొనుట అందరికి అనుభవైకయోగ్యమే. కావున శక్తియొక్క అనుభవము అందరికి తెలిసిన విషయమే. ఆబాల గోపవిదితాయనుటలో అందరు అంబయొక్క అనుభూతిని కలిగిన వారేనని చెప్పుచున్నాడు. దేవి యొక్క శాసనము, ఆజ్ఞను యెవరు మీరజాలరు. ఆమె యొక్క శాసనము ఎవ్వరిచేతను ఉల్లంఘింపరానిది. దేవి స్థానము శ్రీచక్రము. అదియే ఆమె నివాసము. త్రిపురాసుర సంహారమును గావించినవాడు శివుడు. అతడే త్రిపురుడు. త్రిపురాత్మకమగు శ్రీ చక్రనివాసి పరమశివుడు. మహాపూజ్యుడైన త్రిపురుని సుందరి అనగా ఆయన భార్య త్రిపురసుందరి. శివశక్తులకభేదము. వారిద్దరి ఐక్యమునే తన రూపముగా గలిగియున్నది కావున శివా అనుచున్నాడు. ప్రాపంచిక క్రీడయే వారి లీల. లీలా వినోదార్థమై ఈ జగన్నాటకమునకు సూత్రధారులై దానిని చిత్ర విచిత్రముగా నాడించుచున్నారు. మనమంతా ఈ నాటకములో పాత్రధారులమే గనుక దేవి ఇష్టానుసారము పాత్రోచిత పోషణచేసి తరించుదముగాక.

ఈ సంపుటి ముగింపు సందర్భముగా పోతనామాత్యుడు రుక్మిణీకల్యాణ ఘట్టమున స్తుతించి తరించిన పద్యమును మననం చేసుకొందామా?



॥నమ్మితి నామనంబున సనాతనులైన యుమామహేశులన్
మిమ్ము బురాణ దంపతుల మేలు భజింతు గదమ్మ మేటి పె
ద్దమ్మ దయాంబురాశివి గదమ్మ హరింబతి సేయుమమ్మ నిను
నమ్మినవారి కెన్నడు నాశనములేదు గదమ్మ ఈశ్వరీ॥

జ్ఞానం, జ్ఞేయం, జ్ఞానగమ్యం అని గీతాచార్యుడు సూత్రీకరించినాడు. ఇది నిత్య సత్యయుతమైన ఉపదేశము. అదియే శ్రీ లలితాసహస్రనామ స్తోత్రముయొక్క సందేశము, ఉపదేశమును కూడ అయియున్నది. భగవద్గీతను, లలితా సహస్ర నామస్తోత్రములను గూడ రచించినవాడు వ్యాసుడే అయియున్నందున ఈ ఉపదేశము యాదృచ్ఛికముగా ఒకటియే అయినది.

భక్తులు ఈ లలితా సహస్రనామ సోత్రములో యే ఒక్క మంత్రమును మననం చేసినా అది వారిని రక్షించి తిన్నగా దరిచేర్చును అనుటలో యెట్టి సందియమును లేదు. కావున దేవి భక్తులు ఈ లలితా సహస్రనామ స్తోత్రమును పారాయణము చేసియు ఆమె చరితలు చదివియు, వినియు శుభంబులనొందుదురు గాక.

చూ : 'మననాత్ త్రాయతే' ఇతిమంత్ర:
మంత్రమును మననము చేసినంత మాత్రముననే
అది మననము చేసిన వారిని రక్షించునని భావము.

శ్రీ లలితాంబికార్పణమస్తు.

ఉ॥ శ్రీలలితాంబికా స్మరణ సేవలచేతనె యుర్విలోపలన్
గాలము సేయు పోకడల కారణమైన విరోధ బాధలన్
జాలగజేసి యెల్లపుడు శాంతిని గూర్చుచు భక్తకోటికిన్
మేలొనరించు తల్లులలో మేటి కొనర్తును మంగళంబిదే.

మంగళం మహత్.



చితాభస్మా లేపో గరళ మశనం దిక్పటిధరో
జటాధారీ కంఠే భుజగపతిహారీ పశుపతి: ।
కపాలీ భూతేశో భజతి జగదీశైక పదవీం
భవాని త్వత్పాణిగ్రహణ పరిపాటి ఫలమిదమ్॥ 7

నమోక్షస్యా కాంక్షాభవతి భవవాంఛాపిచనమే
నవిజ్ఞానాపేక్షా శశిముఖ ముఖేచ్ఛాపి నపున: ।
అతస్త్వాం యాచేహం జనని జననం యాతుమమవై
మృడానీ రుద్రాణీ శివ శివ భవానీతి జాపత: ॥ 8

నారాధితాసి విధినా వివిధోపచారై:
కింరూక్ష చింతనచ యైర్నకృతం వచోభి: ।
శ్యామే త్వమేవ యదికించిన మయ్యనాథే
ధత్సే కృపాముచిత మంబ పరం తథైవ ॥ 9

అపత్సుమగ్న స్మరణం త్వదీయం
కరోమి దుర్గే, కరుణార్ణవే శివే ।
నైతచ్ఛఠత్వం మమదాతయత్వం
క్షుధా తృషార్తా జననీం స్మరంతి ॥ 10

జగదంబ విచిత్ర మంత్ర కిం
పరిపూర్ణా కరుణాస్తి చేన్మయి,
అపరాధ పరంపరా వృతం
నహి మాతా సముపేక్షతే సుతమ్ ॥ 11

ఇతి శ్రీమత్ శంకరాచార్య విరచితం
దేవ్యపరాధస్తోత్ర రత్నం
సంపూర్ణం.

# అనుబంధము - 2

## శ్రీలలితా సహస్రనామ స్తోత్రమ్

ఐం హ్రీం శ్రీం శ్రీమాత్రే నమః
శ్రీమాతా శ్రీమహారాజ్ఞీ శ్రీమత్సింహాసనేశ్వరీ,
చిదగ్నికుండసమ్భూతా దేవకార్యసముద్యతా. 1
ఉద్యద్భానుసహస్రాభా చతుర్బాహుసమన్వితా,
రాగస్వరూపపాశాఢ్యా క్రోధాకారాంకుశోజ్జ్వలా. 2
మనోరూపేక్షుకోదండా పంచతన్మాత్రసాయకా,
నిజారుణ ప్రభాపూరమజ్జద్బ్రహ్మాండ మండలా. 3
చమ్పకాశోకపున్నాగ సౌగన్ధికలసత్కచా,
కురువిందమణి శ్రేణీ కనత్కోటీరమండితా. 4
అష్టమీ చంద్ర విభ్రాజదలిక స్థలశోభితా,
ముఖచంద్ర కళంకాభ మృగనాభివిశేషకా. 5
వదనస్మర మాంగల్యగృహతోరణచిల్లికా,
వక్త్ర లక్ష్మీపరీవాహచ లన్మీనాభలోచనా. 6
నవచంపకపుష్పాభనాసాదండవిరాజితా,
తారాకాంతి తిరస్కారినాసాభరణభాసురా 7
కదంబమంజరీ క్లుప్తకర్ణపూరమనోహరా,
తాటంకయుగలీభూతతపనోడుపమణ్డలా. 8
పద్మరాగశిలాదర్శ పరిభావికపోలభూః,
నవవిద్రుమబింబ శ్రీన్యక్కారిదశనచ్ఛదా. 9
శుద్ధవిద్యాంకురాకారద్విజపఙ్క్తిద్వయోజ్జ్వలా,
కర్పూరవీటికామోదసమాకర్షద్దిగంతరా. 10
నిజసల్లాపమాధుర్యవినిర్భర్త్సితకచ్ఛపీ,
మందస్మిత ప్రభాపూరమజ్జత్కామేశమానసా. 11
అనాకలితసాదృశ్యచుబుకశ్రీవిరాజితా,
కామేశబద్ధమాంగల్యసూత్రశోభితకంధరా. 12
కనకాంగద కేయూర కమనీయ భుజాన్వితా,
రత్నగ్రైవేయచింతాకలోలముక్తాఫలాన్వితా. 13
కామేశ్వరప్రేమరత్నమణిప్రతిపణ స్తనీ,
నాభ్యాలవాలరోమాళిలతాఫలకుచద్వయీ. 14

కామేశ్వరముఖాలోకకల్పితశ్రీగణేశ్వరా. 30
మహాగణేశనిర్భిన్నవిఘ్నయంత్రప్రహర్షితా,
భండాసురేంద్రనిర్ముక్తశస్త్రప్రత్యస్త్రవర్షిణీ. 31
కరాంగుళినఖోత్పన్ననారాయణదశాకృతిః,
మహాపాశుపతాస్త్రాగ్ని నిర్దగ్ధాసురసైనికా. 32
కామేశ్వరాస్త్రనిర్దగ్ధసభండాసురశూన్యకా,
బ్రహ్మోపేంద్రమహేంద్రాది దేవసంస్తుతవైభవా. 33
హరనేత్రాగ్ని సందగ్ధకామసంజీవనౌషధిః,
శ్రీమద్వాగ్భవకూటైకస్వరూపముఖపంకజా. 34
కంఠాధఃకటిపర్యంతమధ్యకూటస్వరూపిణీ,
శక్తికూటైకతాపన్నకట్యధోభాగధారిణీ. 35
మూలమంత్రాత్మికా మూలకూటత్రయకళేబరా,
కుళామృతైకరసికా కుళసంకేతపాలినీ. 36
కుళాంగనా కుళాంతస్థా కౌళినీ కుళయోగినీ,
అకుళా సమయాంతస్థా సమయాచారతత్పరా. 37
మూలాధారైకనిలయా బ్రహ్మగ్రంథివిభేదినీ,
మణిపూరాంతరుదితా విష్ణుగ్రంథివిభేదినీ. 38
ఆజ్ఞాచక్రాంతరాళస్థారుద్రగ్రంథివిభేదినీ,
సహస్రారాంబుజారూఢా సుధా సారాభివర్షిణీ. 39
తటిల్ల తాసమరుచిష్షట్చక్రోపరిసంస్థితా,
మహాశక్తిః కుండలినీ బిసతంతుతనీయసీ. 40
భవానీ భావనాగమ్యా భవారణ్యకుఠారికా,
భద్రప్రియా భద్రమూర్తిర్భక్తసౌభాగ్యదాయినీ. 41
భక్తప్రియాభక్తిగమ్యా భక్తివశ్యాభయాపహా,
శాంభవీ శారదారాధ్యా శర్వాణీ శర్మదాయినీ. 42
శాంకరీ శ్రీకరీ సాధ్వీ శరచ్చంద్రనిభాననా,
శాతోదరీ శాంతిమతీ నిరాధారా నిరంజనా. 43
నిర్లేపా నిర్మలా నిత్యా నిరాకారా నిరాకులా,
నిర్గుణా నిష్కళా శాంతా నిష్కామా నిరుపప్లవా. 44
నిత్యముక్తానిర్వికారా నిష్ప్రపంచా నిరాశ్రయా,
నిత్యశుద్ధా నిత్యబుద్ధా నిరవద్యా నిరంతరా. 45

చిన్మయీ పరమానందా విజ్ఞానఘనరూపిణీ. 61
ధ్యానధ్యాతృధ్యేయరూపా ధర్మాధర్మవివర్జితా,
విశ్వరూపా జాగరిణీ స్వపంతీ తైజసాత్మికా. 62
సుప్తా ప్రాజ్ఞాత్మికా తుర్యా సర్వావస్థావివర్జితా,
సృష్టికర్త్రీ బ్రహ్మరూపా గోప్త్రీ గోవిందరూపిణీ. 63
సంహారిణీ రుద్రరూపా తిరోధానకరీశ్వరీ,
సదాశివానుగ్రహదా పంచకృత్యపరాయణా. 64
భానుమండలమధ్యస్థా భైరవీ భగమాలినీ,
పద్మాసనా భగవతీ పద్మనాభ సహోదరీ. 65
ఉన్మేష నిమిషోత్పన్న విపన్న భువనావళిః
సహస్ర శీర్ష వదనా సహస్రాక్షీ సహస్రపాత్. 66
ఆబ్రహ్మకీటజననీ వర్ణాశ్రమవిధాయినీ,
నిజాజ్ఞారూపనిగమా పుణ్యాపుణ్య ఫలప్రదా. 67
శ్రుతిసీమంతసిందూరీకృతపాదాబ్జధూళికా,
సకలాగమసందోహశుక్తిసంపుటమౌక్తికా. 68
పురుషార్థప్రదాపూర్ణా భోగినీ భువనేశ్వరీ,
అంబికానాదినిధనా హరిబ్రహ్మేంద్ర సేవితా. 69
నారాయణీ నాదరూపా నామరూపవివర్జితా,
హ్రీంకారీ హ్రీమతీ హృద్యా హేయోపాదేయవర్జితా. 70
రాజరాజార్చితా రాజ్ఞీ రమ్యా రాజీవలోచనా,
రంజనీ రమణీ రస్యా రణత్కింకిణిమేఖలా. 71
రమా రాకేందువదనా రతిరూపా రతిప్రియా,
రక్షాకరీ రాక్షసఘ్నీ రామా రమణలంపటా. 72
కామ్యా కామకలారూపా కదంబకుసుమప్రియా,
కల్యాణీ జగతీకందా కరుణారససాగరా. 73
కళావతీ కళాలాపా కాంతా కాదంబరీప్రియా,
వరదా వామనయనా వారుణీమదవిహ్వలా. 74
విశ్వాధికా వేదవేద్యా వింధ్యాచలనివాసినీ,
విధాత్రీ వేదజననీ విష్ణుమాయా విలాసినీ. 75
క్షేత్రస్వరూపా క్షేత్రేశీ క్షేత్ర క్షేత్రజ్ఞపాలినీ,
క్షయవృద్ధివినిర్ముక్తా క్షేత్రపాలసమర్చితా. 76

చందనద్రవదిగ్ధాంగీ చాంపేయకుసుమప్రియా. 92
కుశలా కోమలాకారా కురుకుల్లా కుళేశ్వరీ,
కుళకుండాలయా కౌళమార్గతత్పరసేవితా. 93
కుమారగణనాథాంబా తుష్టిః పుష్టి ర్మతి ర్ధృతిః,
శాంతి స్స్వస్తిమతీ కాంతిర్నందినీ విఘ్ననాశినీ. 94
తేజోవతీ త్రినయనా లోలాక్షీ కామరూపిణీ,
మాలినీ హంసినీ మాతా మలయాచలవాసినీ. 95
సుముఖీ నళినీ సుభ్రూశ్శోభనా సురనాయికా,
కాలకంఠీ కాంతిమతీ క్షోభిణీ సూక్ష్మరూపిణీ. 96
వజ్రేశ్వరీ వామదేవీ వయోవస్థావివర్జితా,
సిద్ధేశ్వరీ సిద్ధవిద్యా సిద్ధమాతా యశస్వినీ. 97
విశుద్ధిచక్రనిలయా రక్తవర్ణా త్రిలోచనా,
ఖట్వాంగాది ప్రహరణా వదనై కసమన్వితా. 98
పాయసాన్నప్రియా త్వక్స్థా పశులోకభయంకరీ,
అమృతాదిమహాశక్తి సంవృతా ఢాకినీశ్వరీ. 99
అనాహతాబ్జనిలయా శ్యామాభా వదనద్వయా,
దంష్ట్రోజ్జ్వలా క్షమాలాదిధరా రుధిరసంస్థితా. 100
కాళరాత్ర్యాదిశక్త్యౌఘవృతా స్నిగ్ధౌదనప్రియా,
మహావీరేంద్రవరదా రాకిన్యంబాస్వరూపిణి. 101
మణిపూరాబ్జనిలయా వదనత్రయసంయుతా,
వజ్రాది కాయుధోపేతా డామర్యాదిభిరావృతా. 102
రక్తవర్ణా మాంసనిష్ఠా గుఢాన్న ప్రీతమానసా,
సమస్తభక్తసుఖదా లాకిన్యంబాస్వరూపిణీ. 103
స్వాధిష్ఠానాంబుజగతా చతుర్వక్త్రమనోహరా,
శూలాధ్యాయుధసంపన్నా పీతవర్ణాతిగర్వితా. 104
మేదోనిష్ఠా మధుప్రీతా బందిన్యాదిసమన్వితా,
దధ్యన్నాసక్తహృదయా కాకినీరూపధారిణీ. 105
మూలాధారాంబుజారూఢా పంచవక్త్రాస్థి సంస్థితా,
అంకుశాదిప్రహరణా వరదాదినిషేవితా. 106
ముద్గౌదనాసక్తచిత్తా సాకిన్యంబాస్వరూపిణీ,
ఆజ్ఞాచక్రాబ్జనిలయా శుక్ల వర్ణా షడాననా. 107

కళాత్మికా కళానాథా కావ్యాలాపవినోదినీ,
సచామరరమావాణీసవ్యదక్షిణ సేవితా. 123
ఆదిశక్తి రమేయాత్మా పరమా పావనాకృతిః,
అనేక కోటిబ్రహ్మాండజననీ దివ్యవిగ్రహా. 124
క్లీంకారీ కేవలా గుహ్యా కైవల్యపదదాయినీ,
త్రిపురా త్రిజగద్వంద్యా త్రిమూర్తి స్త్రిదశేశ్వరీ. 125
త్ర్యక్షరీ దివ్యగంధాఢ్యా సిందూరతిలకాంచితా,
ఉమా శైలేంద్రతనయా గౌరీ గంధర్వసేవితా. 126
విశ్వగర్భా స్వర్ణగర్భా వరదా వాగధీశ్వరీ,
ధ్యానగమ్యా పరిచ్ఛేద్యా జ్ఞానదాజ్ఞానవిగ్రహా. 127
సర్వవేదాంతసంవేద్యా సత్యానందస్వరూపిణీ,
లోపాముద్రార్చితా లీలాక్లప్తబ్రహ్మాండమండలా. 128
అదృశ్యాదృశ్యరహితా విజ్ఞాత్రీ వేద్యవర్జితా,
యోగినీ యోగదా యోగ్యా యోగానందా యుగంధరా. 129
ఇచ్ఛాశక్తిజ్ఞానశక్తిక్రియాశక్తిస్వరూపిణీ,
సర్వాధారా సుప్రతిష్ఠా సదసద్రూపధారిణీ. 130
అష్టమూర్తి రజా జైత్రీ లోకయాత్రావిధాయినీ,
ఏకాకినీ భూమరూపా నిర్ద్వైతా ద్వైతవర్జితా. 131
అన్నదా వసుధా వృద్ధా బ్రహ్మాత్మైకస్వరూపిణీ,
బృహతీ బ్రాహ్మణీ బ్రాహ్మీ బ్రహ్మానందా బలిప్రియా. 132
బాషారూపా బృహత్సేనా భావాభావవివర్జితా,
సుఖారాధ్యా శుభకరీ శోభనా సులభాగతిః. 133
రాజరాజేశ్వరీ రాజ్యదాయినీ రాజ్యవల్లభా,
రాజత్కృపా రాజపీఠనివేశితనిజాశ్రితా. 134
రాజ్యలక్ష్మీః కోశనాథా చతురంగబలేశ్వరీ,
సామ్రాజ్యదాయినీ సత్యసంథా సాగరమేఖలా. 135
దీక్షితాదైత్యశమనీ సర్వలోకవశంకరీ,
సర్వార్థదాత్రీ సావిత్రీ సచ్చిదానందరూపిణీ. 136
దేశకాలాపరిచ్ఛిన్నా సర్వగా సర్వమోహినీ,
సరస్వతీ శాస్త్రమయీ గుహాంబా గుహ్యరూపిణీ. 137
సర్వోపాధివినిర్ముక్తా సదాశివపతివ్రతా,

పాశహస్తా పాశహంత్రీ పరమంత్రవిభేదినీ. 153
మూర్తా మూర్తా నిత్యతృప్తా మునిమానసహంసికా,
సత్యవ్రతా సత్యరూపా సర్వాంతర్యామినీ సతీ. 154
బ్రహ్మాణీ బ్రహ్మజననీ బహురూపా బుధార్చితా,
ప్రసవిత్రీ ప్రచండా జ్ఞా ప్రతిష్ఠా ప్రకటాకృతిః. 155
ప్రాణేశ్వరీ ప్రాణదాత్రీ పంచశత్పీఠరూపిణీ,
విశృంఖలా వివిక్తస్థా వీరమాతా వియత్ప్రసూః. 156
ముకుందా ముక్తినిలయా మూలవిగ్రహరూపిణీ,
భావజ్ఞా భవరోగఘ్నీ భవచక్రప్రవర్తినీ. 157
ఛందస్సారా శాస్త్రసారా మంత్రసారా తలోదరీ,
ఉదారకీర్తి రుద్దామవైభవా వర్ణరూపిణీ, 158
జన్మమృత్యుజరాత ప్తజనవిశ్రాంతిదాయినీ,
సర్వోపనిషదుద్ఘుష్టా శాంత్యతీతకళాత్మికా. 159
గంభీరా గగనాంతస్థా గర్వితా గానలోలుపా,
కల్పనారహితా కాష్ఠా కాంతా కాంతార్ధవిగ్రహా. 160
కార్య కారణనిర్ముక్తా కామ కేళితరంగితా,
కనత్కనకతాటంకా లీలావిగ్రహధారిణీ. 161
అజా క్షయవినిర్ముక్తా ముగ్ధా క్షిప్రప్రసాదినీ,
అంతర్ముఖసమారాధ్యా బహిర్ముఖసుదుర్లభా. 162
త్రయా త్రివర్గనిలయా త్రిస్థా త్రిపురమాలినీ,
నిరామయా నిరాలంబా స్వాత్మారామా సుధాసృతిః. 163
సంసారపంకనిర్మగ్న సముద్ధరణపండితా,
యజ్ఞప్రియా యజ్ఞకర్త్రీ యజమానస్వరూపిణీ 164
ధర్మాధారా ధనాధ్యక్షా ధనధాన్యవివర్ధినీ,
విప్రప్రియా విప్రరూపా విశ్వభ్రమణకారిణీ. 165
విశ్వగ్రాసా విద్రుమాభా వైష్ణవీ విష్ణురూపిణీ,
అయోని ర్యోనినిలయా కూటస్థా కుళరూపిణీ. 166
వీరగోష్ఠీప్రియా వీరా నైష్కర్మ్యానాదరూపిణీ,
విజ్ఞానకలనా కల్యా విదగ్ధా బైందవాసనా. 167
తత్త్వాధికా తత్త్వమయీ తత్త్వమర్థస్వరూపిణీ,
సామగానప్రియా సౌమ్యా సదాశివకుటుంబినీ. 168

# అనుబంధము - 3

కీ॥శే॥ శ్రీ అచ్యుతన్న గోపాలశర్మగారు శ్రీదేవిని స్తుతించిన కీర్తనలను భక్తులు లబ్ధినొందుటకు పొందు పర్చబడినవి.

రాగం - మోహన : తాళం - ఆది.

1.ప॥ శ్రీ రాజరాజేశ్వరీ - మాం పాహి జగదీశ్వరీ ॥ శ్రీ ॥

ఆ.ప.॥ నంద నందన సోదరీ - వరానంద
సంధాయినీ నిజభక్త లోక సంతతాన పాయిని ॥శ్రీ॥

చ॥ రాజితశుభగుణ జాలే - బాలే
రాజకళా - సుశోభిత ఫాలే
కంథర మండిత కపాలమాలే
సుందర తాండవ - మృదుపద జాలే.

దు॥ మహిషాసుర మదాపరహారిణి
కులసంకేతపాలిని - కాళిని
శ్యామలే సదా సుమంగళే - సదా
శివ కుటుంబిని - మహాకాళి ॥శ్రీ॥

చ॥ శ్రీ దాయినీ, సంధ్యారూపిణి - భవ
సంహారిణి - లోక దారిద్ర్యహారిణి
శక్తిత్రయమూలరూపిణి శక్తి
కూటైక ధారిణి - సువాసిని

దు॥ పద్మాలయ పద్మినీ - పద్మ - భవ
కారిణీ వారిణీ - సుహాసిని
చక్రేశ్వరి చక్రరాజ రూపిణి
చక్రాయుధవైష్ణవి మహాలక్ష్మి ॥శ్రీ॥

చ॥ వాణీ విద్యాదాయిని - పుస్తకపాణి
వీణానాదలోలిని పల్లవపాణి
ప్రజ్ఞాన ఘనరూపిణి - విశ్వ

చ॥ లాలి శివకామేశ్వరీ - శ్రీదేవి - లాలిచిద్ఘనరూపిణీ
లాలి తనియెలు వాసినీ - మమ్మేలు
త్రిపుర సుందరి భారతీ ॥లా॥

చ॥ బిందు మండల వాసినీ.- పావనీ
ఇందు ధర ప్రియ సుందరీ
వందారు జనవత్సలా వందనము
నంద నందన సోదరీ ॥లా॥

చ॥ కలి కల్మష వినాశినీ కామినీ - కామకోటి విలాసినీ
కార్య కారణ రూపిణీ శర్వాణి
కాత్యాయినీ మోహినీ ॥లా॥

చ॥ ఖండితా సురమండలీ - అఖండ
లాది వందిత సుందరీ
చండీగణాధీశ్వరీ - శాంకరీ శ్రీ రాజరాజేశ్వరీ ॥లా॥

చ॥ మలయాచలము నిలయము - నీతేజ
మలరించు దిగ్వల యము
నీ కోపమే ప్రళయము - కరుణించి
మమ్మేలు నీవారము. ॥లా॥

చ॥ లలితా పరార్థ ధాత్రీ - యోగి, లలితానంద
దివ్యకీర్తి
నీలమేఘాభగాత్రీ - గాయత్రి సచ్చిదానంద
మూర్తి ॥లా॥

చ॥ బ్రహ్మాండముల బ్రోవను - చాముండి
యాగ మండపమునందున
ఓంకారమును డోలిక - వెలయించి
యూగింతు నీకేళిక ॥లా॥

చ॥ ఎంత చక్కని తల్లివే - సంతత, స-దానంద
గుణవల్లివే
పశుమలేశుని తల్లివే - గోపాల - దాసునేలెడి
దానవే ॥లా॥

చ॥ బ్రాహ్మికాత్యా - యనీ గౌరీ
దుర్గ మహేశ్వరీ - చండీ
కృష్ణ వారాహి, కౌమారీ
వైష్ణవీ, కాశీ - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ ఇంద్ర నీలవు - కాంతి దేహము
చంద్ర చూడము - వహ్ని నేత్రము
అష్టభుజముల - దివ్య రూపము
చూడగోరెదము - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ గజ్జె లందెలు - ఘల్లు మనగను
బొజ్జలో, లో - కములు కదలగ
లాస్యమాడెడి - త్రిపుర సుందరి
శివ మనోరమణీ - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ బ్రాహ్మిరౌద్రీ వైష్ణవీ, రూ
పమునకాల - త్రయము నందున
ద్విజులు కొల్చెద - రమ్మ; జగముల
నేల రావమ్మా - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ మాతరో శ్రీ - చక్ర నగరము
ద్వారమున బ్ర-హ్మాది సురులును
నారదాది మహా - మునీంద్రులు
నిలచి నారమ్మా - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ మొదట మూలా - ధారమందున
కామకోటి శి-వాంక మందున
కుండలిని యని-దివ్యరూపున
పవ్వళించితివి తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ కోటి సూర్యప్రకాశమై - ప్రణ
వాంత మమృత - కారణమ్మది
సహ స్రారమ్మనెడి నగరము
చేరవెలనమ్మా - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ నీదు అందము - నీదు చందము
నీదు శౌర్యము - నీదు కరుణ
నీదు రాజస - మెందు గానము
నిజము నిజమమ్మా - తల్లీ లమేలుకొనవే ॥ మే ॥

చ॥ దీనుడను పా - పాత్ముడను, రో
గార్తుడను రి-క్తుండ నిన్నే
శరణమంచును - మ్రొక్కువాడను
బ్రోవ వలెనమ్మా - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ మహిని సాగర - తీరమందున
వాడరేవు పురా - నలలితా
నంద సిద్ధాశ్ర - మము నందున
వెలసినావమ్మా - తల్లీ మేలుకొనవే ॥ మే ॥

చ॥ పశుమలాఖ్య నగమునేలెడి
గుహుని గొల్చిన - దాసదాసుడు
దీనుడీ గో - పాలదాసుని
దయను గనవలను తల్లీ మేలుకొనవే ॥ మే ॥



8. గురుగుహ మూర్తే గుహ్యాజ్ఞాన - సద్గురుమూర్తే లలితానందా
ఘోరపాప చయ ఖండిత, దండిత - దుర్జనత లలితానందా ॥ ఆనందం

9. జ్ఞానజ్ఞేయ జ్ఞాతృరూపని - త్యానందా లలితానందా
చిత్స్వరూప చేతన చైతన్యా - చిదానంద లలితానందా ॥ ఆనందం

10. ఛాత్ర రక్షణాంకిత కంకణధర - కరుణాలయ లలితానందా
జన్మాంతర కర్మని బర్హణ, జిత - కామక్రోధ లలితానందా ॥ ఆనందం

11. ఘటిత పాప సంచయ నిర్వ్యాసిత - దారిద్ర్యా లలితానందా
ఝణిఝణ్యాది సునాద విలోలా - సిద్ధరాజ లలితానందా ॥ ఆనందం

12. టంకృత గంభీర వచాసు హృదయ-మామక శ్రీ లలితానందా
ఢుంఢి వినాయక పూజ పరాయణ పరమ భక్త లలితానందా ॥ ఆనందం

13. తీవ్రతపస్థిత తీక్షణ మూర్తి చిద్రూపశ్రీ లలితానందా
ధర్మదేవ సద్ధర్మ నిరూప సు - ధీవర లలితానందా ॥ ఆనందం

14. దీనవత్సలా దైన్య విమోచన దయానిధే లలితానందా
ధరణీ సురవర ధరణీ సురప్రియ - ధైర్యసాంద్ర లలితానందా ॥ ఆనందం

15. నిర్మలరూపా నిత్యానందా - నిరవద్యా లలితానందా
పరమపురుషా, పతితావన, పావన - నామ శ్రీ లలితానందా॥ ఆనందం

16. ఫణిరాజ విభూషా ఫణిరూపా పాపహరా లలితానందా
బుద్ధ రూపధర బుధజన సేవిత - బుద్ధాశ్రయ లలితానందా॥ ఆనందం

17. భుక్తిముక్తి సంధాత నిఖిలభువ - నాశ్రయణా లలితానందా
మహనీయా మహిమా ప్రదర్శకా - మంగళకర లలితానందా॥ ఆనందం

# ఓం శ్రీ సాయినాథాయ నమః

